Photo by R. S. Subbiah



బహుమతి
పొందిన వ్యాఖ్య

అస్వతంత్ర జీవులం

పంపినవారు :
జె. ఆర్. కె. శాస్త్రి - చిలకలపూడి

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక చిత్రకథ, ఫొటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.







ఎప్పుడు దేనితోను
ఫలితం కనబడదో...

... మేనర్స్
గ్రైప్ మిక్చర్ యిచ్చి

దానికి బదులు వచ్చే
చిరునవ్వు చూడండి




"మదర్‌క్రాఫ్ట్ అండ్ చైల్డ్ కేర్" అను మా 40 పేజీల పుస్తకానికి వ్రాయండి. ప్రతి పీసాతోడు వుండే కూపన్‌తో పాటు, మీ చిరునామా, 40 నయాపైసల స్టాంపులతో సహా పోస్ట్ ఆఫీస్ బాక్స్ 976, బొంబాయి 1, కి వ్రాయండి.

మంచి రకాలలో శ్రేష్టమైన యీ చిహ్నం చూడండి.



ఇది మేనర్స్ ఉత్పత్తి

GEOFFREY MANNERS & CO. PRIVATE LTD., BOMBAY · DELHI · CALCUTTA · MADRAS.

ASP/GM6



# గంగా దృశ్యము

మన విశాలమైన, విచిత్రమైన భారత దేశములో పెద్ద నదులన్నిటిలోను గంగానది అతి ప్రఖ్యాతమైనది. అత్యంత ఉపకారశాలి.

గంగా నది మంచుతో కప్పబడిన హిమాలయ పర్వతాలలో ఉద్భవించి చాల ఎత్తునుండి మంచు కరగిన నీటితో క్రిందకు ప్రవహిస్తూంది. ఈ పరిసరాలు నిశ్చల, ప్రశాంత వాతావరణము సౌందర్య శోభాయమానమూ కలిగి వున్నాయి. ఇంకా క్రింద మైదానములో యీ గంగా ప్రవాహము గంభీరమైన నదియై, ఎడతెరిపిలేని రహదారి మార్గమై ప్రశాంతముగా సముద్రంలోకి ప్రవహిస్తూంది.

గంగానది యిరువైపుల స్నాన ఘట్టాలు, పడవ రేవులతో నిండి వున్నాయి. ఒక ఒడ్డునుంచి మరియొక ఒడ్డుకు పడవలు, మనుష్యులను, సరకులను, రవాణా చేస్తూన్నాయి. తరచుగా ఆ సరకులలో "బ్రూక్ బాండ్ టీ" మార్కుగల టీ పెట్టెలు కూడ కనిపిస్తాయి. అవును మరి! దేశములో ప్రతి చోట లాగే ఈ గంగా మైదానములో కూడ "బ్రూక్ బాండ్ టీ"నే ప్రజలు హర్షిస్తారు. రేవులదగ్గర అంగళ్లు, టీ దుకాణాలు ప్రయాణీకులకు టీ అంద జేస్తాయి. పడవవాళ్లు పడవను తోసేముందు, తర్వాత సాయంకాలము పని ముగిసింతర్వాత టీ త్రాగుతారు.

గంగా మైదానము గంగయొక్క ప్రసాదమే. ఈ నది ఒండ్రు మట్టిని క్రిందకు తీసుకువచ్చి ఈ పల్లపు ప్రదేశాలని ఫలవంతం చేస్తూంది. ఆ చిక్కటి మృదువైన మట్టి వివిధములైన పంటలను విరివిగ నిచ్చి కోట్లాది ప్రజలకు ఆహారము సమకూరుస్తూంది. ఈ మైదానము హిందూ దేశమునకు ధాన్యపు గాదె అనడంలో ఆశ్చర్యము లేదు. అలాగ గంగా నది భూమిని సారవంతము చేస్తూంటే, బ్రూక్ బాండ్ టీ తన యొక్క తాజాతనము, సువాసనా పరిమళములతో ప్రజలకు అమితోత్సాహము యిస్తూంది.

BB 235

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్



ప్రతి మర్ఫీ రేడియో సెట్టు మీ గృహానికి మరింత ప్రతిష్ఠ చేకూర్చటానికి నిర్మించబడింది. ....ఏళ్లతరబడి మీకు మధురగానం వినిపించటానికి సృష్టించబడింది!

*All keyed up!*

# murphy

ఈనాటి అత్యంత ప్రియమైన రేడియో!



**SOUNDS GOOD!**
**LOOKS GOOD!**

మోడెల్ 254

* 6-వాల్వ్ 4-బాండు * ఏసి అండ్ ఏసి/డిసి (2 మోడల్సు) * రు. 390

లోకల్ టాక్సులు అదనం

దక్షిణ ఇండియాలో సోల్ ఏజంట్లు — మహమద్ ఇబ్రహీం అండ్ కో., ప్రైవేట్ లి., 7/8, మౌంట్ రోడ్డు, మద్రాసు-2 — బ్రాంచి : బెంగళూరు.

# రోజంతా శుభ్రముగా నుండుటకు

ఆకర్షణీయమైన సువాసన, బహుమెత్తని పొడి-మరే టాయ్‌లెట్ పౌడరులోనూ లేనట్టి-చమట దుర్గంధమును, చర్మవ్యాధులను గలిగించు క్రిములను నిర్మూలించే లోకప్రసిద్ధయిన జి.11* వీటిని గలిగియున్నప్పటికి గోద్రెజ్ టాయ్‌లెట్ పౌడరు ఎక్కువ ఖరీదేమీ లేదు.

స్నానానంతరముగాని, క్షౌరానంతరముగాని, గోద్రెజ్ టాయిలెట్ పౌడరును చల్లుకుంటే మీరు చాల ఉత్సాహముగాను, ఎక్కడకు వెళ్లినా ఆదరణీయంగాను వుంటారు.

ఉక్కపోతనుండి నిలకడైన శీఘ్ర విముక్తి గలిగించి, చమట వల్ల చర్మము రేగుటను పోగొట్టును.. ఇది పశిబిడ్డలకు వరప్రసాదము!

బట్టల మీద చల్లితే చర్మ ఉష్ణమును నిరోధించును.

## గోద్రెజ్ టాయ్‌లెట్ పౌడరు

దుర్గంధమును పోగొట్టును • సురక్షకమైనది
సువాసనగలది • శమనకరమైనది

సంపూర్ణ రక్షణకు సింథాల్‌తో స్నానముచేసిన పిదప వాడండి.
(*పేటెంట్ హెగ్జాక్లొరోఫీన్ యు. ఎస్. పి.)



గోద్రెజ్ శ్రేష్ఠమైన సబ్బులను ఇతర టాయిలెట్రీలను తయారుచేయును.

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మనసలో కొంత గొప్పతనం వుంటేనే గాని ఇతరులలో వుండే గొప్పతనం గమనించలేము. మనం కొన్ని అపాయాలను ధైర్యంగా ఎదుర్కొన్నప్పుడే మన గొప్పతనం రుజువవుతుంది.

"అపూర్వమైన కానుక" [బేతాళ కథ] లో శల్యుడు తన గుర్రాన్ని కోసల రాజుకు బహుమానంగా ఇచ్చి ఇంటికి తిరిగి వెళ్లివుంటే అతని గొప్పతనంగాని, కోసలరాజు గొప్పతనంగాని రుజువయి వుండేదికాదు. శల్యుడు ఏంచేశాడో బేతాళ కథలో చదవండి.

సంపుటి 22 మార్చి 1958 సంచిక 3



# అట్టవిూది బొమ్మ

అర్జునుడు నేరుగా దుర్యోధనుడివేపు వెళ్ళుతూఉండటం చూసి, కౌరవ యోధులూ, సైనికులూ దుర్యోధనుడికి అండగా పరిగెత్తారు. ఈలోపల అర్జునుడు గట్టిగా శంఖం పూరించేసరికి విరాటరాజు గోవులమందలు బెదిరి ఇళ్ళకేసి పరిగెత్తసాగాయి. యుద్ధంలో ముందుగా కృపాచార్యులు అర్జునుడికి ఎదురు వచ్చాడు. కొద్దిసేపట్లో అర్జునుడు కృపాచార్యుడి రథాన్నీ, గుర్రాలనూ, సారథినీ భగ్నంచేసేశాడు. తరవాత ద్రోణుడు అర్జునుణ్ణి ఎదుర్కొన్నాడు.

ద్రోణుడు తానై బాణాలు వేసేవరకూ అర్జునుడు తన గురువుపై బాణం వెయ్యలేదు. తరవాత ఇద్దరూ భయంకరంగా శస్త్రాస్త్రాలతో యుద్ధం చేసుకున్నారు. ద్రోణుడు ఓడిపోగానే కౌరవసేనలో హాహాకారాలు చెలరేగాయి.

తన తండ్రికి జరిగిన అవమానం సహించలేక అశ్వత్థామ అర్జునుడిపైకి వచ్చి యుద్ధం చేస్తూండగా కర్ణుడు వచ్చాడు.

వెంటనే అర్జునుడు అశ్వత్థామను విడిచి కర్ణుడిపైకి బెబ్బులిలాగా లంఘించి తీవ్రమైన యుద్ధం చేశాడు. కొద్దిసేపట్లోనే కర్ణుడి రొమ్ములో బలంగా బాణం గుచ్చుకున్నది. అతను పారిపోయాడు.

ఇది చూసి చిల్లరయోధులందరూ ఒక్కుమ్మడిగా అర్జునుడిమీదికి వచ్చారు. ఒక్క ఐంద్రాస్త్రంతో అర్జునుడు వారినందరినీ చెల్లాచెదురు చేశాడు.

అది చూసి భీష్ముడు అర్జునుడితో తలపడ్డాడు. ఆయన అర్జునుడి శరీరాన్ని చాలా గాయపరిచాడు, కాని చివరకు ఓడిపోయాడు. తరవాత దుర్యోధనుడు తన ప్రతాపం చూపవచ్చి, గుండెలో బాణం గుచ్చుకోగా వెనక్కు తిరిగి పారిపోయాడు.

యుద్ధం అయిపోయింది. ఉత్తరుడు తన చెల్లెలు కోరిన బొమ్మల గుడ్డలు తీసుకున్నాడు. వారు విరాటనగరానికి బయలుదేరారు. నగరంలో ఈ వార్త తెలిసేసరికి విరాటుడూ, ధర్మరాజూ జూదం ఆడుతున్నారు. "చూశావా? నా కొడుకు కౌరవ యోధులనందరినీ జయించి వస్తున్నాడు!" అన్నాడు విరాటుడు.

"అది బృహన్నలవల్ల కావలిసిందేగాని నీ కొడుకువల్ల అయ్యే పని కాదు," అన్నాడు ధర్మరాజు. ఆ మాటకు అలిగి విరాటుడు ధర్మరాజు ముఖంమీద పాచిక విసిరివేశాడు. ధర్మరాజు ముఖంనుంచి రక్తం కారసాగింది. పక్కనే ఉన్న ద్రౌపది తన చీరచెంగుతో ఒత్తి, రక్తం కిందపడకుండా ఆపింది.




[గత సంచిక తరువాయి]

అది మొదలు ఆయన రాజభవనం పై అంతస్తులో కూచుని ఎవరినిగాని చూడ లేదు, కిందికి దిగి రాలేదు. ఈ విధంగా నాలుగునెలలు గడిచాయి. రాజభవనం ఆయన కొక బందిఖానాలాగా తోచి దాని నుంచి బయటపడాలని కోరిక కలిగింది.

ఆయన తన నౌకరును పిలిచి తనకు కాషాయవస్త్రాలూ, మట్టిపాత్రా తెమ్మ న్నాడు, మంగలిని పిలిచి తలఅంతా క్షౌరం చేయించుకున్నాడు. మర్నాడాయన కాషాయవస్త్రాలు ధరించి, ఒకచేత మట్టి పాత్రా, ఇంకొక చేతిలో కర్రా పట్టుకుని పై అంతస్తునుంచి దిగివచ్చాడు. దిగివస్తుం డగా రాణి ఆయనను చూసింది గాని గుర్తించలేదు.

కాని త్వరలోనే నిజం బయటపడింది. సీవలీదేవి మేడమీదికి వెళ్లి తన భర్తకేశాలు కిందపడిఉండటం గమనించింది. రాజ భవనం అంతా వెతికారు, రాజు జాడలేదు. రాజుగారు సన్యసించాడన్నారు. అందరూ గొల్లున ఏడుస్తూ సన్యాసి వెళ్ళిన దిక్కుగా వెళ్లారు. సీవలీదేవి మిగిలిన రాణులను వెంటబెట్టుకుని వెళ్లి, తిరిగి రమ్మని ఆయనను బతిమాలింది, కాని ఫలితం లేకపోయింది.

సీవలీదేవి సేనానాయకుణ్ణి పిలిచి ఆయ నతో రహస్యంగా, నగరంలో అనేకచోట్ల మంటలు పెట్టించమన్నది. ఆయన అలాగే చేశాడు. అప్పుడు రాణి తన భర్తవద్దకు వెళ్ళి, "మహారాజా, మీ మిథిలానగరం అంటుకున్నది. మీ సంపద యావత్తూ అగ్ని పాలవుతున్నది! దాన్ని కాపాడుకోండి!" అన్నది.

"రాణీ, నా సొత్తంటూ ఏమీ లేనప్పుడు దాన్ని నేను పోగొట్టుకోవటం ఎలా జరుగు తుంది?" అన్నాడు మహాజనకుడు.



ఆయన కదిలి ఉత్తరద్వారంకుండా నగరం దాటి వెళ్లాడు. రాణీ, ప్రజలూ ఆయనవెంట పడ్డారు. వారు తనవెంట రాకుండా చేయటానికిగాను ఆయన వెనక్కు తిరిగి ప్రజలతో, "ఈ నగరానికి అధిపతి ఎవరు?" అన్నాడు.

"మీరే మహారాజా!" అన్నారు ప్రజలు.

"అయితే ఈ గీత దాటినవారిని దండించండి!" అంటూ ఆయన తన దండంతో దారికి అడ్డంగా ఒక గీత గీసి ముందుకు వెళ్ళాడు. కొంతసేపు ఎవరూ గీత దాట లేదు. కాని తన భర్త వెళ్ళిపోతున్నాడన్న ఆదుర్దాలో సీవలీదేవి గీత దాటి ముందుకు పరిగెత్తింది. వెంటనే ప్రజలుకూడా దాటారు.

త్వరలోనే రాణి తన భర్తను కలుసుకుని, ఆయన కాళ్లపైబడి, "ఈ ప్రజలను చూడండి. మీరు వెనక్కు తిరిగి రావాలని వారంతా కోరుతున్నారు! వారికోరిక మన్నించండి," అన్నది.

"నేను వారందరినీ విసర్జించాను. స్నేహితులనూ, చుట్టాలనూ, నా ఇంటినీ, దేశాన్ని—సమస్తాన్నీ త్యజించాను!" అన్నాడాయన.

"మీరు సన్యసిస్తే నాగతి ఏంకాను?" అన్నది రాణి.



"నీ కుమారుడు మనోవాక్కాయకర్మలా పాపం ఆచరించకుండా రాజ్యపాలన చేసే టట్టు చూడు," అన్నాడు రాజు.

వారు మాట్లాడుతూ నడిచిపోతూండగా సూర్యాస్తమయం అయింది. ఆ రాత్రికి ఒక సముచిత ప్రదేశంలో మజిలీ ఏర్పాటయింది. తిరిగి తెల్లవారగానే మహాజనకుడు లేచి ప్రయాణం సాగించాడు. రాణి తన పరివారాన్ని వెనకగా రమ్మని, తాను మటుకు తన భర్తవెంబడే నడవసాగింది.

పోయిపోయి వారొక నగరాన్ని చేరారు. నగరద్వారంవద్ద కొందరు పిల్లలు ఆడుకుంటున్నారు. ఒక ఆడపిల్ల చేటతో ఏదో చెరుగుతున్నది. ఆమెకు ఒక చేతిన ఒక గాజూ, రెండవచేతికి రెండుగాజులూ ఉన్నాయి. ఆమె చేట చెరిగినప్పుడల్లా ఒక చేతి గాజులు చప్పుడు చేస్తున్నాయి.

ఇది చూడగానే మహాజనకుడికి ఒక ఆలోచన తట్టింది. ఆయన తన భార్యకొక చిన్న పాఠంనేర్పి ఇంటికి పంపేద్దామనుకుని, ఆ పిల్లతో, "అమ్మాయీ, నీ చెయ్యి ఒకటి చప్పుడు చేస్తుందేం? రెండవది చెయ్యదేం?" అన్నాడు.

దానికా పిల్ల, "అయ్యా, ఈ చేతికి రెండు గాజులుండటంచేత చప్పుడు చేస్తున్నాయి. రెండవది అనర్థం!" అన్నది.



రాజు సీవలీదేవికేసి తిరిగి, "ఆ పిల్ల అన్నమాట విన్నావా? రెండవది అనర్థం! నేను నిన్ను వెంటరానిస్తే ఈ పిల్ల చెప్పిన నీతిని తప్పినవాణ్ణవుతాను!" అన్నాడు.

రాణీ తల వంచుకుని తన భర్తను ముందుకు సాగివెళ్ళనిచ్చింది. కాని మరు క్షణమే ఆమెకు దుఃఖం పొంగివచ్చింది. వెంటనే ఆమె పరిగెత్తి తన భర్తను కలుసుకుని ఆయనతోబాటు నడవసాగింది. వారు కొంతదూరం నడిచి ఒక కమ్మరికొలిమి దగ్గిరికి వచ్చారు.

అక్కడ కమ్మరి బాణం తయారు చేస్తున్నాడు. బాణం సూటిగా ఉన్నదో లేదో చూడటాని కతను బాణాన్ని తన కంటికి ఎదురుగా పట్టుకుని రెండవ కన్ను మూసుకున్నాడు.

"నాయనా, చూడటానికి నీకు రెండు కళ్ళుండగా ఒకదాన్ని మూస్తావెందుకు?" అని రాజు కమ్మరిని అడిగాడు.

"రెండుకళ్ళూ తెరిస్తే సూటితెలుస్తుందా, బాబూ? బాణం వంకర లేకుండా ఉందో లేదో చూడాలంటే ఒకకన్నుతోనే చూడాలి. రెండవది అనర్థం!" అన్నాడు కమ్మరి.

"విన్నావా, దేవీ?" అన్నాడు మహాజనకుడు తన భార్యతో. తన భర్త ఇక తనకు దక్కడని సీవలీదేవికి తెలిసిపోయింది. ఆ బాధతో ఆమె స్పృహతప్పి పడిపోయింది. ఆ సమయంలో మహాజనకుడు అరణ్యంలో ప్రవేశించి ఎటో వెళ్ళిపోయాడు.

త్వరలోనే పరివారం వచ్చింది. మూర్ఛపోయిన రాణి ముఖంపై నీరుచల్లి మూర్ఛ తేర్చారు. ఆమె మిథిలానగరానికి తిరిగి వెళ్ళి, తన కుమారుడైన దీర్ఘాయువును రాజ్యాభిషిక్తుణ్ణి చేసింది. ఆమె తిరిగి రాజభవనంలో అడుగుపెట్టలేదు, తోటలో ఒక పర్ణశాల కట్టుకుని సన్యాసినిలాగా జీవించింది.

మహాజనకుడు హిమాలయాలకు వెళ్ళి తపస్సుచేసి సిద్ధి సంపాదించాడు.





# చిక్కులోపడిన నక్క

అడివిలో ఒక కాపు నివసిస్తూండేవాడు. అతను కొంతమేర దున్ని ఆకుకూర మడులు వేశాడు. కుందేలు వాటిని తినమరిగింది.

ప్రతి రాత్రీ ఎవరో వచ్చి తన ఆకు కూరలు తినిపోతూండటం గమనించి కాపు ఒకనాడు ఉచ్చుపన్నాడు.

ఆ ఉచ్చును గమనించక కుందేలు ఆ రాత్రి అందులో చిక్కుకున్నది. దాన్నుంచి తప్పించుకునే ఉపాయం కనిపించలేదు కుందేలుకు.

తెల్లవారుజామున కాపు వచ్చాడు. కుందేలును చూసి, "ఓహో! దొరికావా? రోజూ నా కూరలు తినిపోదామనుకున్నావా? నీ సంగతి చెబుతా ఉండు!" అని, కుందేలుకు బుద్ధి చెప్పటానికిగాను చింతబరికెలు తీసుకురావటానికి వెళ్లాడు.

"తప్పించుకునే ఉపాయం లేదు. ఇవాళ నాకు మూడింది! పొద్దునే లేచి ఎవరి మొహం చూశానో!" అనుకుని కుందేలు కదలక మెదలక కూచున్నది.

సరిగా ఆ సమయానికే నక్క అటుగా వచ్చి, కుందేలును చూసి, "ఓహో, కుందేలా? ఇక్కడ కూచున్నావేం? నీ మెడకు ఆ ఉచ్చు ఏమిటి?" అని అడిగింది.

కుందేలు పొట్ట చేతబట్టుకుని నవ్వుతున్నట్టు అభినయిస్తూ, "భలే గమ్మత్తు! పిల్లలకి సుస్తీగా ఉండటం వల్ల, సాతాని వైద్యుణ్ణి అడిగి నాలుగు కస్తూరి మాత్రలు తీసుకొద్దామని వెళుతుంటే ఆవు అత్త ఎదురై, 'మా అమ్మాయి పెళ్లి చేస్తున్నాం, నువు రాక తప్పదు,' అన్నది. నేను తొందర పనిమీద వెళుతున్నాను గాని, ఈ సారికి నన్ను వదిలెయ్యమన్నా. కాదు కూడదు పెళ్లికి వస్తే తప్ప ఊరుకునేదిలేదని నన్ను ఆవు అత్త నిర్బంధం పెట్టింది. సరే, నాపని పూర్తిచేసుకుని వస్తున్నానని చెప్పా. కాని అవు

టి. శంభుదాసు

అత్త నన్ను నమ్మక, ఇక్కడ కట్టేసిపెట్టి, నన్ను తీసుకురావటానికి ఎవరినన్నా పంపిస్తానని వెళ్లిపోయింది. అదీ సంగతి. నన్ను విడిచిపెట్టేద్దూ, నీ పుణ్యం వుంటుంది. పిల్లలకు ఆ మాత్రలు పడితేగాని నేనింకోపని చూసుకోవటానికి లేదు. అంతగా పెళ్లికి వెళ్లాలనుంటే నిన్ను కట్టిపెడతాను. వాళ్ళు వచ్చి నిన్నే తీసుకు పోతారు," అన్నది కుందేలు. నక్క ఈమాటలు నమ్మి, "అవును, నేను నిన్ను విప్పుతాను, నువు నన్ను కట్టెయ్యి. నన్ను ఒక్కరూ ఏ పెళ్ళికీ పిలవరు!" అన్నది.

కుందేలు నక్కను తనస్థానంలో కట్టేసి, "నేను వైద్యుడిదగ్గిరికి పోయివస్తాను. ఈ లోపల పెళ్లివారు రానేవస్తారులే!" అంటూ కొంచెందూరం వెళ్లి ఒక పొదలో దాగింది.

ఇంతలో కాపు చింతబరికెలు తీసుకుని వచ్చాడు. నక్కను చూసి, "ఇదేమిటి? నా అతుమళ్ళు పాడుచేసేది పోయి కోళ్ళు కాజేసేది వచ్చిందా? దేహశుద్ధి చేస్తానుండు!" అని చింతబరికెలు చెత్త అయినదాకా నక్కను ఎడాపెడా వీకి వదిలాడు.

తరవాత వాడు తన కుక్కలను తీసుకురావటానికి బయలుదేరాడు.

అప్పుడు కుందేలు తిరిగి వచ్చి నక్కను చూసి, "ఇంకా ఇక్కడే వున్నావా? పెళ్లివారు రాలేదా?" అన్నది.

"నాకు పెళ్ళీ వద్దు, పెడాకులూ వద్దు. ఈ ఉచ్చు త్వరగా విప్పు!" అన్నది నక్క.

కాని కుందేలు తాత్సారంచేసి ఆకబుర్లూ ఈకబుర్లూ చెప్పసాగింది. వెంటనే ఉచ్చు విప్పితే నక్క తనను బతకనివ్వదు.

కొంతసేపటికి దూరాన కాపూ, కుక్కలూ కనపడటం చూసి కుందేలు నక్కను సమీపించి ఉచ్చు విప్పింది. కుక్కలు అరుస్తూ సమీపిస్తున్నాయి. నక్క బలంకొద్దీ పరిగెత్తి పారిపోయింది. కుందేలుకూడా ఇంకో దిక్కుగా పరిగెత్తిపోయింది.






## 15

[ఓడ ముక్కలు చెక్కలై నీట మునగగా, పింగళుడు ఒక కొయ్యను ఆధారంగా చేసుకుని సముద్రంలో యీదుకుపోయి ఒక ఎడారిప్రాంతాన్ని చేరాడు. అతడికి నవాబు గారి సేనానాయకుడు హసన్‌గోరీ అనేవాడితో పరిచయం అయింది. ఇద్దరూ కలిసి ఎడారి దొంగలను పట్టుకునేందుకు 'ఇఫీఖిల్లా' అనే కోటవైపుకు బయలుదేరారు. తరవాత—]

నవాబుగారి ఒంటెలపటాలం నాయకుడైన హసన్‌గోరి చేయి వూపినవైపుకు పింగళుడు దృష్టి సారించాడు. ఎదురుగా కనిపించు తున్నది; ఎడారిలో వున్న ఒక పురాతనమైన కోట. కోటపక్కనుంచి, చిన్న కొండవాగు ఒకటి ప్రవహిస్తున్నది. దానికి రెండు అంచులమీదా ఎత్తయిన ఖర్జూరచెట్లు గాలి తాకిడికి తలలు ఆడిస్తున్నవి. కోట బురుజులమీదగానీ, గోడలమీదగానీ మనుష్య సంచారమే లేదు. "ఇదేనా మీరనే ఇఫీ ఖిల్లా?" అని అడిగాడు పింగళుడు.

"అవును, పింగళా! ఆ దూరంగా కొండలకేసి పోతున్న సన్నని రాజమార్గం నీ కంటికి కనుపించుతున్నదిగదా! అదే, బిడారువర్తకులు, టెహరాన్‌నుంచి కైరోకు వెళ్ళే మార్గం. దారిలో వున్న యీ కోట ప్రాంతం వారికి మజిలీగా వుపయోగిస్తున్నది. వారికి మార్గమధ్యంలో ఎడారిదొంగలనుంచి అపాయం కలగకుండా రక్షణయిచ్చేందుకు, యిక్కడ యీ ఇఫీఖిల్లా కట్టబడింది. దీన్ని కాపాడేందుకు రెండువందలమంది సైనికులు కూడా నియోగించబడ్డారు. వారంతా




ఏమయినట్టు? అంతా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వున్నది," అన్నాడు హసన్‌గోరీ.

"మనం ఖిల్లా లోపలకి వెళితే తప్ప, అక్కడ ఏమి జరిగిందీ తెలియదుగదా? బహుశా మీరు లోగడ అనుమానించినట్టు, ఆ ఎడారిదొంగ రాబందు తన అనుచరులతో, ఖిల్లామీద దాడిచేసి, సైనికులను హతమార్చివుంటాడు," అన్నాడు పింగళుడు.

"అంతే అయివుంటుంది. కాని, ఆ రాబందు అనుచరులైనా ఒక్కడూ కనిపించడే!" అన్నాడు హసన్‌గోరీ.

పింగళుడు తను వున్న ఒంటెను ముందుకు నడుపుతూ, "గోరీసాహెబ్! మనం యిక్కడ నిలబడి, ఆ లోపల ఏం జరిగిందో వూహించ ప్రయత్నించటం వృథా శ్రమ. ఖిల్లాద్వారాన్ని చేరితేగాని—ఆ ప్రాంతాల ఎంతటి భీకరసంగ్రామం జరిగిందో తెలియదు. బహుశా ఎడారిదొంగలు ఖిల్లా ముఖద్వారాన్ని కాల్చి నుసి చేసి, తరవాత లోపలకు జొరబడి, సైనికులను హతమార్చి వుంటారు," అన్నాడు.

"నిజం, నిజం! పెద్ద పోరు జరగందే, మా సైనికులు లొంగే రకం కాదు. బహుశా ఎడారిదొంగలు వందల సంఖ్యలో వచ్చి ఖిల్లాను ముట్టడించి వుంటారు," అన్నాడు హసన్‌గోరీ.

క్రమక్రమంగా పింగళుడూ, హసన్‌గోరీ ఎక్కిన ఒంటెలు, ఖిల్లా గోడవెంట కొంత దూరం నడిచి ముఖద్వారం వున్న దిక్కుకు వచ్చినై. కొంచెం వెనకగా, హసన్‌గోరీ అనుచరులుకూడా అక్కడికి చేరారు.

ఖిల్లా ముఖద్వారం చెక్కుచెదరకుండా వున్నది. దాన్ని మామూలుగానే లోపలవున్న వాళ్ళు మూసినవిధంగా, తలుపులు రెండూ ఒకదానికొకటి అనుకునివున్నవి. ద్వారాల ముందు పోరు జరిగిన చిహ్నలేమీ లేవు.

ఎంతో ప్రశాంతంగా కనిపించే యీ దృశ్యాన్ని చూస్తూనే హసన్‌గోరీ పొట్ట చెక్క



లయేలా బిగ్గరగా నవ్వాడు. తరవాత బంటె మీదినుంచి ఒక్క ఉరుకున కిందకు దూకి, "పింగళా! మనం అనవసర భయాలకు లోనయ్యాం. ఎంత జిత్తులమారీ, పొగరుబోతూ అయినా, ఆ రాబందు సాహసించి మా సైన్యాలను ముఖాముఖి ఎదుర్కోవటానికి తెగించలేదు. పోతే, యీ ఖిల్లా ప్రాంతం యింత నిర్మానుష్యంగా వుండటానికి కారణం యిప్పుడిప్పుడే నాకు అర్ధమవుతున్నది," అంటూ చిరునవ్వునవ్వాడు.

పింగళుడు, హసన్‌గోరీకేసి ప్రశ్నార్థకంగా చూశాడు. హసన్‌గోరీ పింగళుడికి మరింత దగ్గిరగా వచ్చి, "మావాళ్లంతా గొంతులవరకూ తాగి, అకైపులో మైమరచి నిద్రపోతూండివుంటారు!" అన్నాడు.

పింగళుడు అనంగీకారంగా తలవూపి, "అలా అనుకున్నా....అ ఎడారిలో వున్న సైనికుడు అక్కడ రాబందుల పాల ఎలా పడినట్టు? అతడుకూడా యీ ఖిల్లారక్షకులలో ఒకడుగదా?" అని అడిగాడు.

"ఆ పొగరుబోతు బహుశా ఖిల్లానుంచి ఒంటరిగా బయటికి వచ్చి, తాగిన మైకంలో ఏ ఖర్జూరచెట్టుకిందనో పడుకునివుంటే— ఆ రాబందు అతణ్ణి చేజిక్కించుకుని వుంటాడు," అన్నాడు హసన్‌గోరీ.




పింగళుడు ఓ క్షణకాలం వూరుకుని, తరవాత ఖిల్లాద్వారంకేసి నడుస్తూ, "మీరు చెప్పినవాటిల్లో ఏవొకటైనా నిజంకావొచ్చు, లేక మనం వూహించని ఏ దారుణ ప్రమాదమైనా జరిగిపోయినా పోవచ్చు. ముందు, ద్వారం తలుపులకు లోపల గడి వేసివున్నదో లేదో చూస్తాను!" అంటూ జాగ్రత్తగా వాటిని సమీపించి, ఎత్తుగా, దృఢంగా వున్న ఆ దేవదారు చెక్కలను రెండు చేతులతోనూ బలంగా వెనక్కు తోశాడు.

తానంత బలం వుపయోగించటం వృథా అని పింగళుడు వెంటనే గ్రహించాడు. లోపల గడి వేయబడని ఆ తలుపులు కిరు



మని శబ్దంచేస్తూ, చేయి పట్టేంతగా వెనక్కు జరిగినై. అది చూస్తూనే పింగళుడు ఒక పెద్ద కేకపెట్టి చెంగున గోడపక్కకు పరిగెత్తాడు. మరుక్షణంలో భూమ్యాకాశాలు బద్దలయినవా అన్నంత భయంకర ధ్వనితో, తలుపుల వెనక మాటుగా దట్టించబడిన తుపాకీమందు పేలి, తలుపు దర్వాజాలనూ, కోటగోడలోని ముందుభాగాన్ని చెల్లాచెదరుగా గాలిలోకి ఎగరకొట్టింది.

ఆ ధ్వనీ, దానితోపాటు లేచిన మంటలూ పొగా అక్కడ వున్న అందర్నీ నిశ్చేష్టులను చేసింది. తలుపు దర్వాజాల చెక్కలూ, కోటగోడ రాళ్లూ తగిలిన కొందరు బాధతో హాహాకారాలు చేశారు. గాయపడిన ఒంటెలు కొన్ని చెవులు చిల్లులుపడేలా అరుస్తూ, రౌతులను పడదోసి ఎడారిలో అన్నివైపులకూ చెల్లాచెదురుగా పారిపోయినై.

ఆ ప్రదేశాన్నంతా అలుముకున్న పొగ, గాలితాకిడికి విచ్చిపోగానే పింగళుడు, తన చుట్టూ జరిగిన భీభత్సాన్ని చూశాడు. ఒంటెల పటాలంలో కొందరు మరణించారు, కొందరు గాయపడి బాధతో మూలుగుతున్నారు. ఆ దృశ్యాన్ని చూస్తూనే కంపించిపోయిన పింగళుడు, త్వరలోనే తెప్పరిల్లి, హసన్‌గోరీ కోసం గాలించసాగాడు. అతడు అక్కడికి అనతిదూరంలో వున్న ఒక ఖర్జూరపుచెట్టు దగ్గరకు గాలితాకుడువల్ల ఎగిరిపోయి, పింగళుణ్ణి చూస్తూనే లేచి కూర్చునేందుకు ప్రయత్నించాడు.

పింగళుడు, హసన్‌గోరీని సమీపించి, తన చేతిని అతడికి ఆసరాగా యిస్తూ, "పెద్ద గాయాలేమీ తగలలేదు గదా?" అని ప్రశ్నించాడు.

"అటువంటి ప్రమాదం ఏమీ జరగలేదు. మందు పేలినప్పుడు పుట్టిన గాలి తాకుడుకు ఎగిరి యింత దూరాన పడ్డాను. ఉదయం లేచిన వేళావిశేషం! ఎంతో అదృష్టవంతుణ్ణి!" అన్నాడు హసన్‌గోరీ.



"ఆఘూట మెల్లిగా అంటావేం, హసన్! తలుపులు తేలిగ్గా వెనక్కు కదిలేసరికే, ఆ వెనక ఏదో మాటు పెట్టబడివుంటుందని నేను గ్రహించాను. అందుకే నేను పెద్దగా కేకపెట్టి ఖిల్లా గోడపక్కకు పరిగెత్తటం జరిగింది. అయినా, దురదృష్టం కొందికీ, నా హెచ్చరికతోపాటే, ఆ దట్టించబడిన తుపాకీ మందు పేలింది!" అంటూ పింగళుడు వెనుదిరిగి చూసి, "దాదాపు సర్వనాశం జరిగిపోయింది. సైనికులు మూడువంతులు మరణించివుంటారు," అన్నాడు.

హసన్‌గోరీ బాధగా లేచి నిలబడి, దుస్తులకు పట్టిన దుమ్మూ యిసకా దులుపుకుంటూ, "ఇది ఆ రాబందు మనను హతమార్చేందుకు వేసిన ఎత్తు. కోటలోవున్న సైనికులందరినీ తుదముట్టించింతరవాత మనను నాశనం చేయటానికి యీ కపటోపాయం ప్రయోగించాడు. ఇక, యిప్పుడు మనం చేయవలసింది, చావగా మిగిలిన సైనికులతో, ఆ క్రూరకర్ముణ్ణి వెతికి వెంటాడి చిత్రహింసలు పెట్టి యమపురికి పంపటం," అన్నాడు ఎంతో ఉద్రేకంగా.

ఆ తరవాత పింగళుడూ, హసన్‌గోరీ కలిసి గాయపడిన సైనికులందరనూ ఖిల్లా గోడ నీడకు చేర్చి, వాళ్ళ గాయాలకు కట్లుకట్టేందుకు కొందరిని నియోగించి, మిగిలిన వారితో ఖిల్లాలోపలకు వెళ్ళారు.




ఖిల్లాలో వారికి ఎదురైన భయంకర దృశ్యం, యిద్దరినీ స్థాణువుల్లా చేసింది. అక్కడ వున్న ప్రతి భవనం, గుడారాలతో సహా నిలువెల్లా కాల్చబడి, ఒట్టి మొండి గోడలుమాత్రం బోసిగా కనిపించినై. ఎక్కడ చూసినా చెల్లాచెదురు చేయబడిన దుస్తులూ, ఆయుధసామగ్రీ కంటబడింది. ఇక, మరణించిన సైనికుల శవాలు అడుగడుగునా ఎదురౌతున్నవి.

"పింగళా! ఒక్కగానొక్క సైనికుడైనా బ్రతికి వున్న సూచనలు లేవు. ఇక్కడ





అతడి ఆజ్ఞ కాగానే అయిదారుగురు సైని కులు ఎడారి అన్నివైపులకూ కొంతదూరం వెళ్లి, కొద్దిసేపట్లోనే తిరిగి వచ్చారు.

ఇసుకలో వున్న ఒంటెల కాలిగుర్తుల ద్వారా, ఆ సైనికులు రాబందు ముఠా ఎటు వెళ్లినదీ, తమ నాయకుడికి చెప్పారు. హసన్‌గోరీ, పింగళుడికి రెండుమూడు క్రోసుల దూరంలో వున్న చిన్న చిన్న పర్వతా లను చూపుతూ, "రాబందు సరాసరి ఆ కొండగుహల ప్రాంతానికి వెళ్ళాడు. తను సాధించిన విజయానికి గర్వించి, వాడిప్పుడు బహుశా తన కాలాన్ని వేడుక లలో గడుపుతూండవచ్చు. వాడి వూహ ప్రకారం, ఆ ఖిల్లాతలుపుల పక్కన వుంచి పోయిన మాటుకు మనంకూడా ఆహుతి కావలసినవాళ్లమేగదా ?" అన్నాడు. పింగ ళుడు అవునన్నట్టు తల వూపాడు.

కొద్దిసేపట్లో, చావగా మిగిలిన సైనికు లను వెంటవేసుకుని, హసన్‌గోరీతోపాటు, పింగళుడుకూడా ఆ పర్వతప్రాంతాలకు బయలుదేరాడు.

ఒక గంటకాలం తరవాత వాళ్ళు ఒకా నొక పర్వత కనుమను సమీపించారు. పింగ ళుడు యిరుప్రక్కలా నిటారుగా లేచిన కొండరాళ్ళకేసి ఓమారు చూచి, "హసన్!

నిజంగా ఏం జరిగిందో, ఆ రాబందుకు తప్ప మరెవరికీ తెలియదు. ఇంతపెద్ద సైన్యాన్ని వాడు సర్వనాశనం చేయగలిగాడంటే, ఖిల్లా లోనే వాడికెవడో మిత్రుడొకడుండి వుండాలి," అన్నాడు హసన్‌గోరీ.

"కావచ్చు," అంటూ పింగళుడు చుట్టూ ఓసారి పరీక్షగా చూసి, "ఇక మనం కాలం వృథాచేయటం ఎందుకు! ఆ రాబందును వెంబడిద్దామా? అతడు యీ ఎడారిలో ఎటు పోయాడో...ఆ జాడలు తెలుసుకోవటం ఎలా ?" అన్నాడు.

"అదేమంత కష్టంకాదు," అంటూ హసన్‌గోరీ బయటికి దారితీశాడు. తరవాత





మనం యిక్కడ రెండు ముఠాలుగా చీలటం మంచిదనుకుంటాను. మన వాహనాలను యిక్కడే వదిలి, యీ రాళ్ళగుట్టల్లో, కొండ గుహల్లో వాడెక్కడ దాగివున్నదీ వెతుకుదాం. కనబడితే, ఏదో సంకేతం ద్వారా యిరు పురమూ ఏకమై వాడి అంతు తేల్చు కుందాం," అన్నాడు.

హసన్‌గోరీ అంగీకరించాడు. పింగళుడు కొంతమంది సైనికులను వెంటదీసుకుని, కొండరాళ్లను ఎక్కుతూ దిగుతూ, రాబందు కోసం గాలించసాగాడు. క్రమంగా వెలుగు తగ్గి చీకటి వ్యాపిస్తున్నది.

అలాంటి సమయంలో హఠాత్తుగా పింగళుడికి, తను వున్న చోటుకు దిగువగా ఏదో అలికిడీ, ఆ వెంటనే కోలాహలం వినిపించింది. పింగళుడు తన సైనికులను హెచ్చరించి, ఒక ఎత్తయిన రాతిచాటున నక్కి కిందికి చూశాడు.

సమతలంగా వున్న ఒకచోట చాలామంది గుంపుగా చేరి పాటలు పాడుతూ, నాట్యాలు చేస్తున్నారు. వాళ్లు ధరించిన దుస్తులూ, చేసే రణగొణధ్వనీ వింటూనే, వాళ్లు ఎడారి దొంగలని పింగళుడు గ్రహించాడు. వెంటనే ముందనుకున్న ప్రకారం సంకేత సూచనగా, పింగళుడు కొమ్ముబూర వూదాడు.



కింద జరుగుతున్న నాట్యాలూ, పాటలూ, ఆ కోలాహలం అంతా ఒక్కసారిగా ఆగిపోయింది. తను వూదిన కొమ్ముబూర ధ్వని దొంగలుకూడా విన్నారని పింగళుడికి అర్థమైపోయింది. ఇక ఆలసించి లాభంలేదు. వెంటనే పింగళుడు ఒక పెద్ద కొండరాయిని, దిగువ వున్న దొంగల మీదికి దొర్లిస్తూ, తన సైనికులనుకూడా ఆజ్ఞాపించాడు.

పింగళుడు తోసిన రాయి భూమిని తాకి తాకకముందే 'జుఁమ్'మంటూ కొన్ని అంబులు అతడున్నచోట రాళ్ళను తాకినై. పింగళుడు చప్పున ఒక రాతి వెనకకు తప్పుకుని, కిందికి తొంగిచూశాడు. కొందరు

దొంగలు యీటెలు చేబూని బిగ్గరగా అరుస్తూ, కొంత ఎక్కుతున్నారు. అదే సమయంలో, మరొక దిక్కునుంచి కొన్ని బండరాళ్లు దొర్లుతూ వాళ్ళమీద పడి, అందరినీ చెల్లాచెదురుచేసినై.

తన సంకేతం హసన్‌గోరీ అందుకున్నాడని పింగళుడు చాలా సంతోషించాడు. వెంటనే అతడు వున్న బలాన్నంతా కూడగట్టుకుని, దొంగలమీదికి కొండరాళ్ళను తోస్తూ కిందికి దిగసాగాడు. హసన్‌గోరీతో వున్న సైనికులు సింహనాదాలు చేసి, కొండరాళ్ల మీదుగా కుప్పించి దూకుతూ, దొంగలముఠా వున్న చోటుకు పరిగెత్తుతున్నారు.

పింగళుడుకూడా తన సైనికులను వెంట పెట్టుకుని, దొంగలువదిలే బాణాలను తప్పుకుంటూ ముందుకు పరిగెత్తసాగాడు.

రెండు ముఠాలూ కొండ దిగువనున్న సమతల ప్రదేశాన్ని చేరేసరికి, ఎక్కడి దొంగలక్కడ చెల్లాచెదురుగా పరిగెత్తారు. కాని, వెనకబడిన కొందరు దొంగలను తమ చేత గల యీటెలతో హసన్‌గోరీ సైనికులు పొడిచి చంపారు.

"పింగళా! కమ్ముకొస్తున్న యీ చీకటిలో మనం వాళ్ళను వెన్నాడలేము. ఈ రాత్రికి యిక్కడే మజిలీచేసి, సూర్యోదయం కాగానే వాళ్ళ అంతు తేల్చుకుందాం," అన్నాడు హసన్‌గోరీ. పింగళుడికూడా అదే మంచిమార్గంగా తోచింది. అతడు అంగీకార సూచకంగా తలాడించి, అక్కడ బల్లపరుపుగా వున్న ఒకరాతి మీద కూర్చోబోయేంతలో, "ఎవరా పింగళుడు? అవంతీ నగర జాలరి కాదుగదా?" అన్నమాటలు ఆ కొండగుట్టల మీద ప్రతిధ్వనించినై.

"ఎవరు? పద్మపాదుడా?" అంటూ పింగళుడు ఆ ప్రశ్న వచ్చిన వైపుకు తిరిగాడు. నిలువెత్తున వున్న ఒకరాతి చాటునుంచి పద్మపాదుడు నవ్వుతూ ముందుకు వస్తున్నాడు. —(ఇంకా వుంది)



# అపూర్వమైన కానుక

పట్టువిడవని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని మరొకమారు మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ కార్యదీక్ష నిజంగా ఆశ్చర్యకరమైనది. అయితే నీలాటి కార్యదీక్ష గలవారు ఒక్కొక్కసారి అతి విచిత్రంగా ప్రవర్తించుతారు. ఇందుకు ఉదాహరణగా శల్యుడనేవాడి కథ చెబుతాను విను," అంటూ ఈ కింది కథ చెప్పసాగాడు :

పూర్వం గాంధారదేశంలో శల్యుడని ఒక పేద యువకుడు ఉండేవాడు. వాడికి దేశాటన చేయాలని ఎంతో ఉబలాటం. ఇందుకుగాను వాడు చిన్నతనంనుంచీ ఎంతో కష్టపడి సంపాదించి; సంపాదించిన సొమ్ము కూడబెట్టాడు. ఒకనాడు వాడు తన తల్లితో, "అమ్మా, నాకు కాశీదాకా తిరిగిరావాలని ఉన్నది. మూడేళ్లలో తప్పక తిరిగి వస్తాను.

## బేతాళ కథలు

నేను కూడబెట్టిన సొమ్ములో సగం నువు వాడుకున్నట్టయితే మూడేళ్ళూ నీకు లోటు లేకుండా జరిగిపోతుంది. మిగిలిన సగం డబ్బూ నాకు దారిబత్తెంగా పనికి వస్తుంది," అన్నాడు. ఇందుకు తల్లి మొదట ఆక్షేపణ చెప్పింది గాని, వాడి కోరిక తీసివెయ్యలేక చివరకు ఒప్పుకున్నది.

గాంధారదేశంలో మేలుజాతి గుర్రాలున్నాయి. వాటిని ఎంతో వెల ఇచ్చి సింధు దేశవాసులు కొంటూ ఉంటారు. అందుచేత శల్యుడు తన దేశంలోనే ఒక మేలుజాతి గుర్రాన్ని కొని దానిమీద ప్రయాణమై కాశీ నగరానికి బయలుదేరాడు. దానిని కాశీ రాజుగారికి బహుమానం ఇచ్చి తన యాత్రకు నిదర్శనంగా ఆయన వద్దనుంచి తిరుగు బహుమానం పొందాలని శల్యుడి ఉద్దేశం. అటువంటి బహుమానం తనవద్ద కలకాలం ఉంటుంది. దాన్ని గురించి తరతరాలుగా చెప్పుకుంటారు.

శల్యుడు తన గుర్రాన్ని ప్రాణంతో సమంగా కాపాడుకుంటూ చాలా కాలం ప్రయాణంచేసి కోసలదేశం చేరాడు. అక్కడ అతని కొక సత్రంలో విడిది దొరికింది. శల్యుడు ఎవరినీ ఆకర్షించలేదుగాని, అతను ఎక్కివచ్చిన గుర్రం ప్రతి ఒక్కరినీ ఆకర్షించింది. అలాటి గుర్రాన్ని వారెన్నడూ చూడలేదు. "ఇంతమంచి గుర్రం మన రాజుగారి దగ్గిరకూడా లేదు!" అని ప్రజలు అనుకోసాగారు.



ఈ వార్త త్వరలోనే కోసలరాజుగారి చెవిని పడింది. ఆయన తన భటులను సత్రానికి పంపి శల్యుణ్ణీ, అతని గుర్రాన్నీ తెప్పించాడు.

"ఏమోయి, నీకీ గుర్రం ఎక్కడ దొరికింది?" అని రాజుగారు శల్యుణ్ణి అడిగాడు.

"మహారాజా, మాది గాంధార దేశం. అక్కడ ఇలాటి గుర్రాలు చాలా ఉన్నాయి," అన్నాడు శల్యుడు.

" అయితే ఈ గుర్రాన్ని నాకు అమ్ము తావా ? వెయ్యి వరహాలిస్తాను," అన్నాడు కోసలరాజు.

" దీన్ని అమ్మే ఉద్దేశం లేదు, మహా రాజా !" అన్నాడు శల్యుడు.

" పోనీ రెండువేల వరహాలకు అమ్ము. నీ అవసరానికి ఇంకొక మంచి గుర్రం ఉచి తంగా ఇస్తాను," అన్నాడు రాజు.

" ఎంత సొమ్ముకైనా ఈ గుర్రాన్ని అమ్మను, మహారాజా," అన్నాడు శల్యుడు.

" అలా అయితే దాన్ని నాకు బహుమా నంగా ఇచ్చి నాదగ్గిరనుంచి మరొక బహు మానం పుచ్చుకో," అన్నాడు రాజు.

" దీన్ని మరొకరికి బహుమానంగా అది వరకే నిర్ణయించాను, మహారాజా," అన్నాడు శల్యుడు.

" ఎవరికి ?" అన్నాడు రాజు శల్యుడి జవాబుకు ఆశ్చర్యపోతూ.

" కాశీరాజుగారికి !" అన్నాడు శల్యుడు.

కోసలదేశపురాజు కళ్లు అవమానంతోనూ ఆగ్రహంతోనూ ఎర్రబడ్డాయి. " మాకూ వారికీ యుద్ధం జరుగుతున్నది తెలియదా ? ఈ దేశంనుంచి ఆ దేశానికి నువు ప్రాణా లతో వెళ్లటమే ఎంతో కష్టం. మా సైనికులో వారి సైనికులో నిన్ను హతమార్చేస్తారు !" అన్నాడు రాజు.



"రాసిపెట్టి వుంటే ఆపగలమా, మహా రాజా ?" అన్నాడు శల్యుడు.

కోసలరాజు కాస్సేపు యోచించి, "సరే నీయిష్టం! మాదేశం క్షేమంగా దాటటానికి గాను నీకు అనవాళ్ళు ఇప్పిస్తాను. నువు క్షేమంగా కాశీ చేరిన పక్షంలో, తిరిగి వెళ్లే టప్పుడు నాకు కనబడి కాశీరాజు నీకేమి ప్రత్యుపకారం చేసినదీ తప్పక చెప్పి మరీ వెళ్లు!" అన్నాడు.

"చిత్తం, మహారాజా!" అన్నాడు శల్యుడు వినయంగా.

అతను కోసలదేశపు సరిహద్దు దాటటానికి రాజుగారిచ్చిన అనవాళ్లు చాలా తోడ్పడ్డాయి. అతను కొద్దిరోజులలో కాశీనగరం చేరుకుని కాశీరాజు దర్శనం చేసుకుని, "మహారాజా, నేను గాంధార దేశనుంచి వచ్చాను. తమకు కానుకగా ఈ గుర్రాన్ని తెచ్చాను, స్వీకరించండి!" అన్నాడు.

కాశీరాజు పరమానందభరితుడై శల్యుణ్ణి తన కొలువులో ఉంచుకుని మంచి జీతమూ, ఇతర సౌకర్యాలూ ఏర్పాటు చేశాడు.

ఒక సంవత్సరం గడిచింది. శల్యుడు రాజుగారి వద్దకు వెళ్లి, "మహారాజా, నా కిక సెలవిప్పించండి," అన్నాడు.

"అదేమిటి? అప్పుడే నాకొలువు మొహం మొత్తిందా?" అన్నాడు రాజు.






"లేదు, మహారాజా. నాకు హరిద్వారం వెళ్లిరావాలని ఉన్నది," అన్నాడు శల్యుడు.

"అలా అయితే తప్పక వెళ్ళిరా!" అన్నాడు రాజు.

ఆయన శల్యుడి ప్రయాణానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేయించాడు.

అయితే ఈ ప్రయాణం శల్యుడికి అనర్థంగా పరిణమించింది. దారిలో అతనికి జబ్బుచేసి చచ్చినంత పని అయింది. రాజుగారిచ్చిన డబ్బంతా ఖర్చయిపోయింది. చిక్కి శల్యమై, కట్టుబట్టలన్నీ చిరిగి, బికారిలాగా దారివెంబడి బిచ్చమెత్తి కడుపు నించుకుంటూ అతను కాశీనగరం చేరాడు.

తీరా రాజభవనందగ్గిరికి వచ్చేసరికి అతన్ని ఎవరూ గుర్తించలేదు. తాను ఫలానా అని చెప్పుకోవటానికికూడా శల్యుడు సిగ్గుపడ్డాడు.

ఈస్థితిలో అతను ద్వారంవద్ద తటపటాయిస్తూండగా రాజుగారు అటుగా వచ్చి శల్యుణ్ణి చూశాడు. చూసిన క్షణం ఆయన అతన్ని గుర్తుపట్టి ఆలింగనంచేసుకుని, "ఏమయింది? ఇలా చిక్కిపోయావేమిటి? ఈ బట్టలేమిటి?" అంటూ ఆత్రంగా ప్రశ్నించాడు.

శల్యుడు జరిగినదంతా రాజుకు చెప్పాడు. ఈసారి రాజుగారు శల్యుడికి ఇంకా మంచి ఉద్యోగం ఇచ్చి అతనికి బలంచేకూరటానికి ఔషధాలూ, ప్రత్యేకమైన ఆహారమూ ఏర్పాటు చేశాడు.

ఇంకొక సంవత్సరం జరిగిపోయింది. శల్యుడొకనాడు రాజుగారివద్దకు వెళ్లి, "మహారాజా, వెళ్లివస్తాను, సెలవిప్పించండి," అన్నాడు.

రాజుగారు వెనకటిలాగే, "అదేమిటి? నా కొలువు అప్పుడే మొహంమొత్తిందా?" అని అడిగాడు.

"లేదు, మహారాజా, ఇంటివద్ద బయలుదేరేటప్పుడు మా అమ్మకు మాట ఇచ్చాను, మూడేళ్ల లోపుగా తిరిగి వస్తానన్నాను.

ఆమాట నిలబెట్టుకోవాలంటే నేనిక వెంటనే ప్రయాణం సాగించాలి," అని శల్యుడు జవాబుచెప్పాడు.

"అయితే నిన్ను ఆపను. అవశ్యం వెళ్ళు," అన్నాడు రాజు. ఆయన శల్యుడికి బోలెడంత ధనమూ, ప్రయాణానికిగాను రథమూ, గుర్రాలూ ఇచ్చాడు. "వీటిని దొంగలు కాజేయవచ్చు. దారిలో వీటికి ఇంకేదైనా ప్రమాదం రావచ్చు. అందుచేత ఎల్లప్పుడూ నీ వెంట ఉండటానికి నా ఉంగరం ఇస్తున్నాను. దీన్ని ఎల్లప్పుడూ నీ వేలినే ఉంచుకో. ఉదారపురుషుడూ ఉత్తముడూ అని తోచినవాడికి మాత్రమే దానిని ఇయ్యి. అంతేకాని సామాన్యుడి కెవరికీ ఇయ్యకు!" అన్నాడు.

శల్యుడు కాశీరాజువద్ద సెలవు తీసుకుని ప్రయాణమైపోతూ దారిలో కోసలదేశపు రాజును కలుసుకున్నాడు.

"నీ గుర్రాన్ని కాశీరాజుకు కానుక పెట్టావా? ఆయన నీకు ప్రతిఫలంగా ఏమిచ్చాడు?" అన్నాడు కోసలరాజు.

"నాకు కొలువిచ్చారు," అన్నాడు శల్యుడు.

"నేనైనా ఆ పనిచేసి ఉండేవాణ్ణే. ఇంకేమిచ్చారు?" అన్నాడు కోసలరాజు.



"నాకు బోలెడంత ధనమిచ్చారు. ప్రయాణానికి రథమూ గుర్రాలూ ఇచ్చారు," అన్నాడు శల్యుడు.

"అవి నేనైనా యిచ్చిఉండేవాణ్ణే. నిన్ను కాలినడకను గాంధారదేశం వెళ్ళమంటానా? ఇంకేమిచ్చారు?" అన్నాడు కోసలరాజు.

"వీటన్నిటినీ దొంగలు దోచినా ఎల్లప్పుడూ తాము జ్ఞాపకం ఉండగలందులకు ఈ ఉంగరం ఇచ్చారు," అన్నాడు శల్యుడు.

"చాలా బాగుంది. నాకైతే ఆ ఆలోచన తట్టివుండేది కాదు!" అన్నాడు కోసలరాజు.

"వారు నాతో ఇంకోమాటకూడా అన్నారు, మహారాజా! ఉదారులూ ఉత్తములూ

అయినవారికి మాత్రమే దీన్ని ఇవ్వమనీ, సామాన్యులకు ఇయ్యవద్దనీ అన్నారు. నన్ను అనుగ్రహించి తమరు ఈ ఉంగరం స్వీకరించాలి!" అన్నాడు శల్యుడు.

కోసలరాజు శల్యుణ్ణి పరమానందంతో ఆలింగనం చేసుకుని, అతనిని కొద్దిరోజులు తన అతిథిగా ఉంచుకుని, అతనికి అంతు లేని కానుకలిచ్చి పంపేశాడు. వీటితో శల్యుడు తన దేశం చేరుకుని తన తల్లితో చాలాకాలం సుఖంగా ఉన్నాడు. తరవాత కాశీ కోసల దేశాల మధ్య యుద్ధాలు లేవు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, శల్యుడి పట్టుదలలో మూర్ఖత్వంకూడా ఉన్నట్టు నాకు తోస్తున్నది. కోసలరాజుకు గుర్రం ఇయ్య నిరాకరించినవాడు, తన దృష్టిలో అంతకన్న విలవైన ఉంగరాన్ని ఎందుకు ఇచ్చేశాడు? కోసలదేశపు రాజుకు కాశీరాజు శత్రువైన సంగతి శల్యుడికి తెలుసుగదా? కాశీరాజు ఉంగరాన్ని ఆయనకే ఎందు కివ్వాలి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

"శల్యుడు ఎంతమాత్రమూ మూర్ఖుడు కాడు. కోసలదేశపు రాజు ఉదారుడన్నది శల్యుడికి ముందే తెలిసిపోయింది. ఉదారుడు కానిపక్షంలో అతని గుర్రాన్ని బలవంతంగా తీసుకునేవాడే తప్ప, తన శత్రువుకు బహుమానం తీసుకుపోయేవాణ్ణి సురక్షితంగా శత్రుదేశంలోకి వెళ్లనిచ్చి ఉండడు. అదీగాక శల్యుడు ఆ ఉంగరాన్ని కోసలరాజుకు కానుక ఇచ్చి ఇద్దరు రాజులమైత్రి సంపాదించుకోవటమే గాక, ఆ ఇద్దరి మధ్యా స్నేహంకూడా చేకూర్చాడు. ఇందువల్ల అతను మూర్ఖుడు కాకపోగా చాలా వివేకి అని నా ఉద్దేశం," అని విక్రమార్కుడు జవాబిచ్చాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# అర్ధణా బాకీ

ఒక ఊళ్లో రామయ్యా అనే బీదవాడుండే వాడు. వాడికి సెంటు పొలంకూడా లేదు. ఎలాగైనా డబ్బు సంపాదించి తానుకూడా ఒక వ్యవసాయదారై, మిగిలిన రైతుల్లాగే సంతకు సామాన్లు తోలుకుపోవాలని రామయ్యా ఉబలాటం. కాని అతను ఎంత ఒళ్లు విరుచుకున్నా తన భుక్తికే సరిపోయీ సరిపోకుండా ఉంటూ వచ్చింది.

చివరకు రామయ్యా ఏదో విధంగా సంతకు సరుకు తీసుకుపోయి అమ్మాలని నిశ్చయించుకున్నాడు. అతనివద్ద మూలెడు ఉన్ని మాత్రం ఉన్నది. ఆ కొద్దిపాటి ఉన్నిని ఊళ్లో ఎవరికి అమ్మినా అమ్మవచ్చు, దానికి ఎంతో డబ్బురాదు. అలాటప్పుడు దాన్ని సంతకు తీసుకుపోతే అందరూ నవ్వుతారు.

అందుకని రామయ్యా ఒకరోజు అడివికి పోయి ఒక గోతంలో పాచిమొక్కలు వేసుకుని ఇంటికి తిరిగి వచ్చాడు. ఆ పాచి మొక్కలపైన తనవద్ద ఉన్న ఉన్ని కప్పి, గోతం మూటగట్టి సంతకు బయలుదేరాడు.

ఇలాటి వాడే సోమయ్యా అనే వాడొకడు కూడా సంతకు ఒక గోతంతో వచ్చాడు. అతనిది ఇంకొక గ్రామం. అతని గోతంలో మూడు వంతులు సరుగుడుకాయలూ, వాటి పైన పోకకాయలూ ఉన్నాయి.

సంతలోకి అడుగు పెట్టటానికి రామయ్యాకు గుండె చాలలేదు. అక్కడ కూరగాయలు గుట్టల్లాగా పేర్చి ఉన్నాయి. ఆవులూ, గొర్రెలూ, మేకలూ, గుర్రాలూ వందల సంఖ్యలో అమ్మకానికున్నాయి. ఒక్కొక్క ఆసామీ బళ్లమీద ఎన్నో వందల రూపాయలు ఖరీదుచేసే సరుకులు తెస్తున్నాడు.

అందుచేత రామయ్యా సంతకు దూరంగా ఒక చెట్టుకింద తన మూటతో సహా కూచున్నాడు. సోమయ్యాకూడా అక్కడికే చేరు

ఆర్. సాంబశివరావు

కున్నాడు. ఇద్దరూ ఒకరినొకరు పలకరించుకుని, నువేం తెచ్చావంటే నువేం తెచ్చావని అడుగుకున్నారు. రామయ్య తన గోతంలో నుంచి ఉన్ని తీసి చూపించి, "భేషైన సరుకు!" అన్నాడు. సోమయ్య తన మూట నుంచి పోకకాయలు తీసి, "చూడు, నిమ్మకాయలంత పోకలు!" అన్నాడు.

"సంత చాలా అడావుడిగా ఉంది. మన బేరం ఎవరూ లక్ష్యపెట్టరు. మనం మన సరుకులు మారకం వేసుకుంటే ఏం?" అన్నాడు సోమయ్య.

"ఉన్నికి పోకలు మారకమా?" అన్నాడు రామయ్య, లోపల ఆశపడుతూనే.

"పోకలైతేనేం? బంగారమంటి సరుకు. అంతగా అయితే ఒక అర్థణా రొక్కం ఇస్తాలే!" అన్నాడు సోమయ్య.

రామయ్య అందుకు ఒప్పుకున్నాడు. ఇద్దరూ మూటలు మార్చుకున్నారు. "వెళ్లి వస్తా," అంటూ సోమయ్య అక్కడినుంచి బయలుదేరాడు.

"నా అర్థణా ఇచ్చి మరీ వెళ్లు," అన్నాడు రామయ్య.

"బాకీ రాసుకో. తరవాత చెల్లువేస్తా. నేనెక్కడికీ పోనులే. మాది ఫలాని గ్రామం. నా పేరు ఎవరినడిగినా చెబుతారు. వెంట డబ్బు తేలేదు," అన్నాడు సోమయ్య.



చేసేది లేక రామయ్యా సోమయ్యాచేత అర్ధణా బాకీ గురించి ప్రమాణం చేయించు కున్నాడు. ఎవరిళ్ళకు వారు వెళ్ళారు. తాము మోసపోయినట్టు ఇద్దరికీ తెలిసి పోయింది. కనీసం అర్ధణాబాకీ అయినా వసూలు చేసుకుందామని రామయ్యా సోమయ్యా ఉండే గ్రామానికి వెళ్ళాడు.

సోమయ్యా ఆ ఊరి షావుకారిదగ్గర కమతం చేస్తాడు. అతను రామయ్యాను చూస్తూనే, "మొత్తానికి నన్ను ముంచావే!" అన్నాడు కోపంగా.

"నువు నన్ను ముంచలేదా ఏమిటి?" అన్నాడు రామయ్యా.

"దానికీ దానికీ చెల్లు!" అన్నాడు సోమయ్యా.

"అదంతా వల్లకాదు. నాకు అర్ధణా బాకీ ఉన్నావు. ప్రమాణంకూడా చేశావు. అది చెల్లువెయ్యి!" అన్నాడు రామయ్యా.

"నాదగ్గిర చిల్లిగవ్వకూడా లేదు. కాని మనమిద్దరమూ లాభంపొందే ఉపాయం ఒకటి చెబుతా విను. మా షావుకారు ఇంటి వెనక ఒక లోతైన గొయ్యి ఉంది. ఒకసారి షావుకారు ఆ గోతిలో నిచ్చెనవేసి దిగుతుంటే చూశాను. అందులో ఏదో దాచివుంటాడు. ఇవాళ రాత్రి మనిద్దరం కలిసి ఆ గోతిలో ఏమున్నదీ తెలుసుకుని తీసుకుని పంచు






కుందాం. సహాయపడతావా?" అన్నాడు సోమయ్య.

రామయ్య కొంచెం అలోచించి సరే నన్నాడు. అందులో ఏదన్నా నిధి దొరికితే ఇంతపాలం కొనుక్కుందామని అతనికి ఆశ కలిగింది.

ఆ రాత్రి సోమయ్య ఒక గోతమూ, తాటి మోకూ తెచ్చాడు. అర్ధరాత్రివేళ ఇద్దరూ షావుకారుగారి దొడ్లో ప్రవేశించారు. రామయ్య మోకు పట్టుకున్నాడు. సోమయ్య గోతంతో సహా మోకుపట్టుకుని గోతిలోకి దిగాడు. అతను ఎంత వెతికినా గోతిలో మట్టి తప్ప ఏమీ కనిపించలేదు.

"ఈ రామయ్య గడుసుముండాకొడుకు. ఏమీ లేదంటే మోకు గోతిలో పారేసి చక్కా పోతాడేమో! అందుచేత యుక్తిగా పైకి వెళ్ళాలి," అనుకుని సోమయ్య తాను గోతంలో కూచుని గోతాన్ని మోకుకు కట్టి, "ఇదుగో, ఇక్కడ వున్నదంతా గోతంలో కట్టాను. దాన్ని పైకిలాక్కుని, మళ్లీ మోకు లోపలికి వేసి నన్నుకూడా లాగు!" అని కేక పెట్టాడు. రామయ్య ఉత్సాహంతో గోతాన్ని పైకిలాగాడు.

"ఈ సోమయ్య నమ్మదగిన మనిషి కాదు. వాడికి ఇందులో ఎందుకు భాగం పెట్టాలి? వాణ్ణి ఆ గోతిలో అఘోరించనీ!" అనుకుని రామయ్య మూట వీపున వేసుకుని తన గ్రామానికి నడవసాగాడు. అందులో సోమయ్య వున్న సంగతి రామయ్యకు తెలియదు.

కొంతదూరం పోయాక మూట బరువనిపించి రామయ్య దాన్ని దించాడు.

వెంటనే సోమయ్య మూట విప్పుకుని బయటికి వచ్చాడు.

"దుర్మార్గుడా, నన్ను మళ్లీ మోసం చేశావా?" అన్నాడు రామయ్య.

"నీ మంచితనం ఏమయింది? నిధిలో నాకు వంతులేకుండా అంతా కాజెయ్యాలని

చూడలేదా? దానికీ దానికీ చెల్లు!" అన్నాడు సోమయ్యా.

"అదంతా వల్లకాదు. నాకు అర్ధణా బాకీ ఉన్నావు. ప్రమాణంకూడా చేశావు!" అన్నాడు రామయ్యా.

"నేను కాదన్నానా? నాదగ్గిర ఉన్నప్పుడు వసూలు చేసుకో!" అన్నాడు సోమయ్యా. ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు.

తరవాత సోమయ్యాకు పెళ్లి అయింది. పెళ్ళాం కొంతడబ్బు తెచ్చింది. సోమయ్యా కమతం మానేసి, కొంత పొలం కొనుక్కుని, వ్యవసాయం ప్రారంభించాడు. అది లాభించింది. ఊరిబయట ఇల్లువేశాడు. మూడుపువ్వులూ ఆరుకాయలూగా ఉంది.

రామయ్యామటుకు ఎప్పటిలాగే ఒళ్ళు విరుచుకుని కష్టించి పొట్టపోసుకుంటున్నాడు. ఒకనాడతనికి సోమయ్యా బాకీవున్న అర్ధణా జ్ఞాపకం వచ్చింది. అది వసూలు చేసుకోవటానికి సోమయ్యా ఉండే గ్రామానికి బయలుదేరాడు రామయ్యా.

సోమయ్యా తన ఇంటిపంచలో కూచుని ఉండగా రామయ్యా వస్తూండటం కనబడింది. వెంటనే అతను లోపలికి వెళ్లి భార్యతో, "ఒసే, బాకీదారు రామయ్యా వస్తున్నాడు. నేను చచ్చిపోయినట్టు పడుకుంటాను. నువు నామీద పడి ఏడుస్తూ ఉండు. సాయంకాలందాకా ఏడిచావంటే ఈ రామయ్యాపీడ శాశ్వతంగా వదిలిపోతుంది," అన్నాడు.




సోమయ్యా భార్య అలాగే చేసింది. రామయ్యా వచ్చి అంతా చూశాడు. కాని అతను వెళ్లిపోలేదు, పంచలోనే తిష్ఠవేశాడు.

"ఇంకా సోమయ్యా నీ బాకీ ఏం చెల్లేస్తాడు, నాయనా? సోమయ్యాకు అన్నిరుణాలూ తీరిపోయాయి!" అంటూ సోమయ్యా భార్య రాగాలు పెట్టింది.

"అయ్యో, సోమయ్యా నాకు దీర్ఘ స్నేహితుడు. అతనికి ఉత్తరక్రియలు చేయించి

మరీ వెళతాను. మేమిద్దరమూ కలిసి చేసిన వ్యవహారాలు బోలెడున్నాయి!" అన్నాడు రామయ్య.

ఆయన ఇంటిబయట నిలబడి దారి పోయేవాళ్ళద్వారా శవవాహకులకోసం కబురుచేశాడు. వాళ్లు వచ్చారు.

"నా బంధువులంతా వచ్చినదాకా శవాన్ని శ్మశానానికి తీసుకుపోవటానికి వీల్లేదు!" అన్నది సోమయ్య భార్య.

సూర్యాస్తమయమయింది. రామయ్య వెళ్లిపోలేదు. ఇరుగుపొరుగు ఇళ్లవాళ్లు వచ్చి, "శవాన్ని కదిలిస్తేగాని మేం ఈ రాత్రికి భోజనం చెయ్యటానికి లేదు. అందుచేత వెంటనే శవాన్ని పాడుపడిన గుడిలోకి చేర్చండి," అన్నారు.

"శవజాగారం ఎవరు చేస్తారు? నేను ఈ శవంతో ఒంటిగా ఆ పాడుపడ్డ ఆలయంలో తెల్లవార్లూ ఉండలేను," అన్నది సోమయ్య భార్య.

"అందుకు నేనున్నానుగా. నా దీర్ఘ మిత్రుడి శవాన్ని రాత్రల్లా నేనే చూసుకుంటాను," అన్నాడు రామయ్య.

సోమయ్య భార్య రహస్యంగా భర్తతో, "ఇప్పుడేం చెయ్యాలి?" అన్నది.

"గుడికి తీసుకుపోనీ. భయంలేదులే!" అన్నాడు సోమయ్య. అతన్ని శవవాహకులు



గుడిలో చేర్చి వెళ్లిపోయారు. రామయ్య శవ జాగరం ప్రారంభించాడు.

అర్ధరాత్రి అయింది. గుడిబయట మనుషుల సందడి అయింది. రామయ్య చప్పున గర్భగుడిలోకి వెళ్లి దాక్కున్నాడు. కొద్ది సేపటిలో నలుగురు దొంగలు గుడిలోకి వచ్చారు. వాళ్ల నాయకుడు ఒక మూట దించాడు. అందులోనుంచి ఖరీదైన నగలూ, డబ్బూ తీసి నాలుగు కుప్పలుగా చేశాడు. ఆ వస్తువులలో ఒక కత్తికూడా వున్నది.

"దీన్ని ఎవరు తీసుకుంటారు?" అని దొంగలనాయకుడు అడిగాడు. దొంగలు చప్పరించి, అది పనికిమాలిన కత్తి అన్నారు.

"కాదు! ఇది భేషైన కత్తి. కావలిస్తే ఒక వేటున ఈ శవాన్ని రెండుగా తెగేసి చూపుతాను!" అంటూ దొంగలనాయకుడు కత్తి తీసుకుని సోమయ్యను సమీపించాడు.

వెంటనే సోమయ్య లేచినిలబడి, "ఏయ్ భూతాలూ! మీరంతా ఎక్కడ చచ్చారు?" అని అరిచాడు. మంత్రం వేసినట్టుగా దొంగలంతా మాయమయారు. ఈ సంగతి తెలుసుకుని రామయ్య ఇవతలికి వచ్చాడు.

"చూశావా? మన పంట పండింది. ఇదంతా పంచుకుందాం పట్టు!" అన్నాడు సోమయ్య. దొంగలు దోచిన సొమ్మంతా పంచుకోవటం పూర్తి అయింది.



"అంతా బాగానే ఉంది. నా అర్ధణా మాటేమిటి?" అన్నాడు రామయ్య. ఇద్దరూ తగాదా పడసాగారు.

ఈలోపల దొంగలు చాలాదూరం పారిపోయి ఒకచోట ఆగారు. దొంగలనాయకుడు తన అనుచరులతో, "మనం ఇవాళ చాలా నామర్దాపని చేశాం. మహామహా యోధులకు కూడా భయపడని మనం దడుచుకుని అంత సొమ్ము వదిలేసి వచ్చాం. మనలో గుండె ధైర్యం గలవాడెవడైనా వెళ్లి ఆ గుడిలో ఏం జరుగుతున్నదీ చూసివస్తే బాగుంటుంది!" అని సలహాయిచ్చాడు.

మిగిలిన ముగ్గురు దొంగలూ వెళ్ల నిరాకరించారు. దొంగలనాయకుడికి తప్పింది కాదు. అతను గుండెలు అరచేత పట్టుకుని పాడుబడిన గుడిని సమీపించి బయటినుంచి ఆలకించసాగాడు. లోపల రామయ్యా సోమయ్యా లిద్దరూ గుడి మారుమోగేట్టు అరుస్తున్నారు. "నా అర్ధణా ఏమైనట్టు!" అంటున్నాడు రామయ్య. "నీ అర్ధణా నీకు ముట్టింది ఫో!" అంటున్నాడు సోమయ్య.

ఈ మాటలు వినగానే దొంగలనాయకుడికి ముచ్చెమటలు పోశాయి. అతను మిగిలిన దొంగలవద్దకు వెళ్లి, "ఓయమ్మో, ఆ గుడిలో ఎన్ని భూతాలున్నాయో మనం ఊహించలేం! మనం దోచిన సొమ్మంతా పంచితే ఒక్కొక్క భూతానికీ అర్ధణా వచ్చింది! అదికూడా అన్ని భూతాలకూ సరిగా అందలేదు! ఇవాళ మనం లేచిన వేళ మంచిది! పోదాం పదండి. బతికుంటే బలుసాకు తినవచ్చు!" అన్నాడు. దొంగలు వెళ్లిపోయారు.

చివరకు రామయ్యా సోమయ్యా రాజీపడ్డారు. తన అర్ధణా కింద రామయ్య దొంగల కత్తి తీసుకున్నాడు. తరవాత రామయ్య తన వంతు ధనంతో ఇంటికి తిరిగి వచ్చి, పొలం కొనుక్కొని, పెళ్లాడి రైతు జీవితం గడపసాగాడు. సంతకు సరుకులు తోలుకుపోవాలన్న అతని కోరిక ఈడేరింది.





# మిత్రసంప్రాప్తి

విన్నదా మాట ఆ - విరిబోణి వాని
క్రన్నన తనవాడు - కాదన్న దంతె.
వెంటనే చెలికత్తె - లంటక వాని
కంట గించుచు 'పొమ్ము - కానరా' కనిరి
చీకటిలో ఎటు - చేరుకో లేక
ఆ కడయున్న దే-వాలయమ్మునకు
చని వాడు మూలగా - శయనింప బోవ
మును మాట మేఱకు - తన వాడె వచ్చె
నని రక్షకుని కూతు - తను కౌగిలించి
కను విచ్చి చూడగ - కావర మెక్కి
అర మర యెఱుగక - అనుభవింపంగ
తరుగని మమతతో - తరుణి వచించె
"ఏమోయి నీటుకా-డా మాట లేదు.
ఈ మాత్రకా పల-పించితి నన్ను"
వాడుక మాటలే - వాడు వచించె
తోడనే ఆ కన్య - త్రోసి వేసినది.
ప్రాప్త మింతే యని - పదపడి వాడు
సుప్తి సౌఖ్యము గోరి - చొచ్చె పురమ్ము.

అట వఱికృంగవు - నా యతనమ్ము
చిట్టి కూతునకు పెండ్లి - సేసెడి దినము.
వరుడు నేనుగు నెక్కి - వాద్యముల్ మ్రోయ
దరియుచు నున్నంత - కరి పిచ్చి యెక్కి
గగ్గోలు పఱచె నా-గత బంధువులను
నుగ్గు నూచమ్మయి - నొచ్చిరి వారు.
దిక్కు కొక్కరుగాగ - తఱవ ఒక్కతెయె
అక్కడ నున్న వీ - డామెను జేరి
భయపడ వలదని - పాణిగ్రహించి
నయముగా రక్షించె - దయమీఱ యతడు.
ఇంతలో సద్దెల్ల - కొంత అడంగ
కాంతలు పూరుషుల్ - కడగి ఏతెంచి
వీని చేయిని పట్టి - వీనిపై వ్రాలి
చానయుండుట గాంచి - సంభ్రమ పడిరి.
ప్రాప్తమెయ్యది అంతె - గుప్తమై వచ్చు
ఆప్తమయ్యదియె లో-కా లోకములను -
అను వానిగని సెట్టి - అంతయు నెఱిగి
అని ఆడలేక రా-జాజ్ఞకై నిలిచె.

విద్వాన్ విశ్వం



ఇంతలో నిది పుర-మంతయు ప్రాకె
అంతట నందఱు - అచటికే తేర.
పాలకుండును వచ్చి - పదిమంది నడిగి
ఏ లీల తోచక - ఏమని యడిగె.
అప్పుడు వారెల్ల - నంతయు చెప్ప
చప్పుడు గాకుండ - చక్కని కూతు
చేసిన దంతయు - చెవులార వినుచు
వాసిగ నింకొక - బాటయే లేక
కూతు నొసంగి నీ - రాత యిదంచు
అతని యువరాజు - నంతట చేసె.
అలయమ్మందున - నతనితో నున్న
ఆ లలనయు వాని - నపుడె పెండ్లాడె.

* * *

కావున, మిత్రులా-రా, విధి బలము
ఏ వారికైన - నిర్జింపగారాదు.
ఏవేవొ బాధల - నిటు తపియించి
ఈ వేళ మనసెల్ల - ఇట్లయ్యె నాకు
అని హిరణ్యక మన్న - నా మిత్రులంత
చనవుతో వానిని - సైయంచు మెచ్చి
కలగి పోకు మటంచు - కలకను తేర్చ
పలికెను తాబేలు - పరమ మిత్రులకు

మందరకం - (తాబేలు)

నీ కథ విన్నంత - నీపైన మరులు
నాకును పుట్టె న-న్నా స్వాగతమ్ము !
ఈ సరస్తీరమం - దే దిగుల్లేక
మా సఖ్యమున నుండు - మది భీతినుడిగి.
విత్తమ్ము వచ్చును - విత్తమ్ము పోవు
విత్త యౌవనములు - సత్తెముల్ గావు.
తెలివైన వానికి - దేశ మేదైన
కలత యేటికి నీది - కాసార మింక.
విత్తముండియు తను - వేసట పడును
చిత్తమ్ము చెడి రట్టి - చెడు దైవఘటన.

హిరణ్యకం :

అది యెట్లు మిత్రమా - అనతిమ్మోయి
పదిలమ్ము ధనమున్న - పాటులవేవి ?

మందరకం :

విను మొక్క కథ చెప్పి - వివరింతు దీని
ధనముండి అనుభవిం-పను వీలుకాదు -

దాపుడు ధనమేల - తనకు కానపుడు
కాపుండి చేసెడి - కార్యమేముండు?

సోమిలకుని కథ :

ఓ మిత్రమా మున్ను - సోమిలకుండు.
ధీమంతు డొక సాలె - తేజు వహించె.
రకరకమ్ముల చిత్ర-రచనలతోడ
చకచక వస్త్రాలు - సంతరించుచును.
పనివాడు పట్టు దు-ప్పటములు నేయు
కని వినని జ-గా జరీలల్లు.
ఏమైన వాని కిం-తే ని ధనమ్ము
ఏమాత్ర మును నిల్వ-కే పోవుచుండె.
నాసి బట్టలు కొన్ని - నేసెడి వారు
గాసి బొందకయుండ-గా వీడు నవయు
పని యెంత చేసిన - బట్ట కట్టుటకు
తినుటకే కాని రా-త్రికి నిల్వ సున్న.
అత నొక్కనాడు భా-ర్యను పిల్చి చెప్పె :

సోమిలకుడు :

గత చింత ఏల ఈ - వితము కష్టమ్ము
ఎంత సంపాదించి - ఏమి లాభమ్ము?
సుంతైన మిగల దో - సుదతి! ఏమందు?
పని వచ్చి యిట్లుంట - పాడిగాదింక
వనిత నేపోయి వ-త్తును ; ఊరు విడిచి.

భార్య :

ఈ మాట లేటికి - ఈ వ్యథలేల?



ఈమాత్ర చాలదా - ఇంకేల మనకు
ఉత్తమాట లివన్ని - ఊరేమిచేసె
విత్తము వచ్చునే - పత్తనమ్మైన
సంపాదనము సేయ - చాలు నీ పురము
కొంపలు దిరిగిన - కూడునా సొమ్ము?

సోమిలకుడు :

విను పోయి వత్తు నే - విత్తమ్ము దెత్తు
మనకు కావలసిన - మాడలు దెత్తు.
ఏపూట కాపూట - ఇది యేమిబ్రదుకు?
దాపుడు డబ్బున్న - దక్కను బ్రదుకు

* * *

అని భార్యతో చెప్పి - అరిగె నాతండు
చని వర్ధమాన ప-ట్టణమును జేరె.



# అలీనూర్

ఒకప్పుడు బస్రానగరానికి మహమ్మద్ ఇబన్ సులేమాన్ సుల్తానుగా ఉండేవాడు. బగ్దాద్‌లో ఉండే ఖలీఫా హారూన్ అల్‌రషీద్ కింద ఈయన సామంతరాజు. ఈ సుల్తాను వద్ద ఇద్దరు మంత్రులుండేవారు. వారిలో వజీర్ అల్‌ఫదల్ అనేవాడు చాలా ఉత్తముడు; వజీర్ అల్‌మూయీన్‌సావీ అనేవాడు చాలా చెడ్డవాడు. అందుచేత ప్రజలు అల్‌ఫదల్ అంటే ఎంతో అభిమానంగా ఉండేవారు, సావీని చూసి భయపడేవారు.

ఇలా ఉండగా ఒకనాడు బస్రానగరానికి అన్నిదేశాలనుంచీ అడబానిసలు అమ్మకానికి వచ్చినట్టు సుల్తానుకు వార్త తెలిసింది. ఆయన అల్‌ఫదల్‌ను పిలిచి, "బానిసలలో అపూర్వమైన సుందరి ఉన్నట్టయితే పదివేల దీనారాలదాకా ఖర్చుచేసి నాకు కొనిపెట్టు," అని ఆజ్ఞాపించాడు. అల్‌ఫదల్ బానిస వర్తకులవద్దకు వెళ్ళి సుల్తానుగారు కోరినటువంటి బానిసకోసం విచారించాడు. వెయ్యి దీనారాలు మించిన ఖరీదుగల బానిసల నందరినీ స్వయంగా చూశాడు. కాని వారిలో ఒకతెకూడా అల్‌ఫదల్‌కు నచ్చలేదు.

అదిమొదలు బానిసవర్తకులు రోజూ ఆయనకు అందగత్తెలను తెచ్చి చూపుతూ వచ్చారు. సుల్తాను ఆయనకు పెట్టిన గడువు ముప్పైరోజులు. ఈ గడువు పూర్తి అయింది. వజీరు వెయ్యిమంది బానిసలను స్వయంగా చూశాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

గడువు పొడిగించమని సుల్తానును కోరుకుందామనే ఉద్దేశంతో అల్‌ఫదల్ గుర్రం ఎక్కి తన ఇంటినుంచి బయలుదేరబోతుండగా ఒక వర్తకుడు వచ్చి, "అయ్యా, తాము కావాలన్న అపురూపసుందరి ఒకతె అమ్మకానికి వచ్చింది," అన్నాడు.

"అయితే ఆమెను వెంటపెట్టుకుని రా!" అంటూ అల్‌ఫదల్ గుర్రం దిగి మళ్లీ లోప

ఎస్. ధర్మారావు





లికి వచ్చేశాడు. మరొక గంటలోపల వర్త కుడు ఒక బానిసపిల్లను తనవెంట తీసుకు వచ్చి పెద్దవజీరుకు చూపాడు. ఆమె నిజం గానే అద్భుత సౌందర్యవతి. ఆమె పేరు అనీస్ అల్‌జలీస్. అనీస్ అల్‌జలీస్ అనే మాటకు "ప్రియసఖి" అని అర్థం. ఆమె గొప్ప అందగత్తె కావటమేగాక బాగా చదువు కుని పాండిత్యంకూడా సంపాదించింది.

వజీర్ అల్‌ఫదల్ ఆమెను కొనటానికి నిశ్చయించుకుని, "ఈ బానిసకు పదివేల దీనారాలిస్తాను. ఈమెను నాకోసం కొనటం లేదు, సుల్తానుగారికోసం కొంటున్నాను. పదివేలవరకూ ఇవ్వటానికి నాకు అనుమతి ఉన్నది," అన్నాడు.

"సుల్తానుగారి కోసం అయినపక్షంలో నేను ఏమిచ్చినా పుచ్చుకుంటాను. కాని ఒక్క విషయం తమరు చిత్తగించాలి. ఈ పిల్ల చాలా దూరప్రయాణం చేసి బస్రాకు ఇవాళే చేరింది. అందుచేత గాలిమార్పు, నీటిమార్పు ఉంటుంది. పదిరోజులపాటు ఈమెకు విశ్రాంతి ఇచ్చి తరవాత సుల్తాను వారికి వప్పగించమని నా సలహా!" అన్నాడు వర్తకుడు. అల్‌ఫదల్‌కు ఈ సలహా నచ్చింది. ఆయన ప్రియసఖిని తన భార్యకు వప్పగించి, "ఈ పిల్ల సుల్తానువారి దాసీ. పదిరోజులపాటు మనఇంట ఉంటుంది. ఈ పదిరోజులూ ఇది మన అబ్బాయి అలీ నూర్ కంటపడకుండా ఎలా చూస్తావో, జాగర్త!" అని చెప్పాడు.

అల్‌ఫదల్ కొడుకు అలీనూర్ చాలా అందమైన యువకుడు. మంచివాడే గాని ఉద్రేకస్వభావం కలవాడు. ప్రియసఖిని వాడు చూశాడంటే తప్పక ప్రేమిస్తాడు. ఒక్కక్షణంలో దాన్ని తన వలలో వేసు కుంటాడుకూడా. సుల్తానుగారిదగ్గిర వజీర్ పరువు కాస్తా పోతుంది. ఈ సంగతులు వజీరు భార్యకు తెలుసు. అందుచేత ఆమె ప్రియసఖిని జనానా దాటి రానివ్వకుండా



వుంచుతూ వారం రోజులపాటు ఎంతో జాగ్రత్తగా కాపాడింది.

ఒకనాడు ఆవిడ స్నానశాలకు వెళ్ళివున్న సమయంలో అలీనూర్ జనానాలో ప్రవేశించి ప్రియసఖిని చూడనే చూశాడు. ఒకరినొకరు చూసుకున్న క్షణానే వారిద్దరిమధ్యా ప్రేమ కలిగింది. అతను ఆమెను ఒప్పించి తనతో బాటు బయలుదేరదీసుకుని, కొంతడబ్బు చేతబట్టుకుని వెళ్ళిపోయి ఆమెను పెళ్లాడాడు.

తన కొడుకు చేసిన పనిచూసి అల్ ఫదల్ కుంగిపోయాడు. "నేను సుల్తానుగారివద్ద ఎంతో మర్యాద సంపాదించుకున్నాను. ఆయనకీ సంగతి తెలిస్తే నా పరువు పోతుంది. నేను నలుగురిలోనూ తల ఎత్తుకుని ఎలా తిరిగేది ?" అన్నాడాయన భార్యతో.

"ఇది సుల్తానుగారిదాకా వెళ్ళవలిసిన అవసరమేమున్నది ? మీ సొంత కుమారుడికి మీరు బానిసను కొనిపెట్టారనుకోండి, అది తప్పా ? కావలిస్తే సుల్తానుగారికి ఇంకొక బానిసను కొని ఇవ్వండి. లోకంలో ఇక అందగత్తెలే లేరా ?" అన్నది భార్య.

చేసేది లేదు గనక వజీరు అల్ ఫధల్ తన కొడుకు చేసిన తప్పు క్షమించ నిశ్చయించాడు. ఈ సంగతి తన తల్లిద్వారా రహస్యంగా తెలుసుకుని అలీనూర్ ప్రియసఖితోసహా ఇంటికి తిరిగి వచ్చాడు.



తన కొడుకూ ప్రియసఖీ ఎంత అన్యోన్యంగా ఉంటున్నారో చూశాక అల్ ఫదల్ మనసు కొంత కుదటబడింది. "అంతా అల్లా నిర్దేశం!" అనుకున్నాడాయన.

చిన్నవజీరు సావీ చాలా జిత్తులమారివాడు. వాడు జరిగినది పసిగట్టి సుల్తానుతో చెప్పి తనమీద ఫిర్యాదు చేస్తాడేమోనని అల్ ఫదల్ భయపడ్డాడు. సావీ కొంతవరకూ నిజం తెలుసుకున్నాడుకూడా; అయితే సుల్తాను గారు బానిసను కొనటం విషయం పూర్తిగా మరిచిపోవటంచేత, పెద్దవజీరుపైన ఫిర్యాదు చెయ్యటానికి అయనకు ధైర్యం చాలలేదు. కొద్దికాలం గడిచింది. పెద్దవజీరు అల్ ఫదల్‌కు జబ్బుచేసింది. ఆయన తన అవసాన కాలం సమీపించిందని తెలుసుకుని, తన కొడుకును పిలిచి అప్పగింతలు చెప్పి, కన్నుమూశాడు. ఆయన మరణానికి కంట తడిపెట్టనివారు బస్రానగరంలో ఒక్కరు కూడా లేరు.

తండ్రిపోయాక అలీనూర్ దుఃఖసాగరంలో మునిగిపోయాడు. చాలారోజులు అతను బయటికి రాలేదు, ఎవరినీ చూడలేదు. చివరకు పెద్దవాళ్ళు అతన్ని మందలించి, "ఇలా విచారిస్తూ కూచుంటే లాభం లేదు. నీద్వారా నీ తండ్రి జీవించే ఉన్నాడు, గద!" అన్నారు.






ఈ సలహాతో అలీనూర్ మారిపోయాడు. అతను తన మిత్రులందరినీ ఆహ్వానించి ప్రతిరోజూ విందులు చేయసాగాడు. బస్రాలో ఉండే పెద్దవర్తకుల కొడుకులందరూ అతనికి మిత్రులే. వారు నిత్యమూ అలీనూర్ చుట్టూ చేరి అతనికి వినోదాలు కలిగిస్తూ, అతని ఖర్చుతో తాముకూడా సమస్త సౌఖ్యాలూ అనుభవించ సాగారు.

అలీనూర్ అమాయకుడు. స్నేహితులు ఏమి అడిగినా ఇచ్చేవాడు. "నూర్, ఫలాని చోట ఉన్న మీ తోటలాటిది నేనెక్కడా చూడలేదు!" అని స్నేహితుడెవడైనా అంటే చాలు, "అది నీదే! తీసుకో!" అనేవాడు.



డబ్బు మంచినీరులాగా ఖర్చయిపోయింది. ఇళ్ళూ, తోటలూ విచక్షణ లేకుండా తన స్నేహితులకు ఇచ్చేసి కొద్ది కాలంలోనే అలీనూర్ దివాలా తీశాడు.

"ముందూ వెనకా చూడకుండా ఎందుకిలా ఖర్చు చేస్తారు. వీరంతా నిజంగా మీ స్నేహితులనే మీరు నమ్ముతున్నారా ?" అని ప్రియసఖి ఎన్నిసార్లో తన యజమానిని హెచ్చరించింది. కాని ఆమె చేసిన హెచ్చరికలు అతని చెవికెక్కలేదు. తన సొత్తంతా పూర్తిగా తరిగిపోయేదాకా అతను ప్రియసఖిని గురించి ఆలోచించనుకూడా లేదు.

ఆఖరుకు స్నేహితులు మాయమయారు.

"మీదగ్గిర సొమ్ము ఉన్నంతకాలమూ ఈగలు ముసిరినట్టు ముసిరారు. ఇప్పుడు ఒక్క స్నేహితుడూ ముఖం చూపించడు!" అన్నది ప్రియసఖి.

"నా స్నేహితులను గురించి నువు అపోహపడుతున్నావు. నేను పూర్తిగా కింద పడిపోయినా నన్ను మళ్ళీ వాళ్ళు లేవనెత్తగల సమర్థులు! వారేవో పనులమీద ఉండి ఉంటారు. నా అవసరం గనక నేనే వారి వద్దకు పోతాను. వారు నన్నెలా ఆదుకుంటారో నువేచూస్తావు!" అంటూ అలీనూర్ మంచి దుస్తులు వేసుకుని వర్తకుల వీధికి వెళ్ళి





మొదటి స్నేహితుడి ఇల్లు చేరుకుని తాను వచ్చినట్టు లోపలికి కబురు పంపాడు.

ఆ స్నేహితుడు అలీనూర్‌ను చూడటం ఇష్టంలేక నౌకరుద్వారా తాను ఇంట లేనట్టు చెప్పించాడు.

"దొంగవెధవ, మొహం తప్పించాడు. కాని మిగిలినవాళ్ళు ఇంత నీచులు కారు!" అనుకున్నాడు అలీనూర్.

కాని ఒక్కరూ అతనిని ఆదుకోలేదు. చిన్నబోయిన ముఖంతో అలీనూర్ తన ఇంటికి తిరిగి వచ్చాడు. జరిగిన సంగతి విని ప్రియసఖి, "నేను చెప్పలేదా?" అన్నది.

తరవాత వారు తమ ఇంట్లో ఉన్న సామగ్రి క్రమంగా అమ్మి ఆ వచ్చిన డబ్బు ఖర్చు పెట్టేసుకున్నారు. ఆ డబ్బుకూడా అయిపోయాక అలీనూర్ విచారంలో మునిగిపోయాడు. అతనికిక బతికే దారి కనబడలేదు.

ప్రియసఖి కన్నీరు కార్చుతూ అతనితో, "సమస్తమూ పోయిందన్న విచారం మీ కెందుకు? మీకు నేనింకా ఉన్నానుగదా! ఒకప్పుడు నన్ను వీధిలో అమ్మితే పదివేల దీనారాలు ధర పలికింది. ఎవరు చూశారు, నాకివాళ ఇంకా ఎక్కువ ధర రావచ్చు. అందుచేత మీరేమీ విచారించక నన్ను బజారులో విక్రయించి సొమ్ము రాబట్టండి!" అని సలహా ఇచ్చింది.

"ప్రియసఖీ, నిన్ను ఎలా అమ్మేది? నువు లేకుండా ఒక్క గంటసేపుకూడా జీవించలేను!" అన్నాడు అలీనూర్.

"మిమ్మల్ని వదిలి ఇంకొక యజమాని దగ్గిరికి వెళ్లటం నాకుమాత్రం ఇష్టమా? కాని అవసరం బలవత్తరమైనది. అది మన చేత ఎలాటి పనిఅయినా చేయిస్తుంది. మీరు ప్రస్తుతం ఉన్న చిక్కునుంచి బయటపడాలంటే ఇదే మార్గం!" అన్నది ప్రియసఖి.

ఆమె ఎంతోసేపు బోధించిన మీదట అతను మనసు రాయిచేసుకుని బజారుకు

వెళ్లి, బానిసలను వేలంవేసేవారిలో గట్టి వాణ్ణి ఒకణ్ణి పట్టుకుని వాడితో తన అవసరం గురించి చెప్పాడు.

"బాబూ, తమరి సేవకుణ్ణి. నావల్ల మీకు కావగిన సహాయం యావత్తూ చెయ్యగలను!" అన్నాడు వేలం వేసేవాడు.

అలీనూర్ వాడికి ప్రియసఖిని చూపించగానే వాడామెను గుర్తించి, "అల్లా సాక్షిగా నేనీమెను అదివరలో ఒకసారి అమ్మాను!" అన్నాడు. ఆమెకు ఎంత హెచ్చు ధర రాబట్టటానికి వీలుంటుందో అంతా రాబట్ట ప్రయత్నిస్తానని అలీనూర్‌కు మాటయిచ్చి, వాడు నలుగురినీ కేకవేసుకు వచ్చాడు.

కొద్దిసేపటికల్లా ఒక గుంపు పోగయింది. ప్రియసఖిని పాటకుపెట్టి, "ధనికుల్లారా, వర్తకశ్రేష్ఠులారా! ఈ అపూర్వ సౌందర్యవతికి ఎంత ధర ఇస్తారో చెప్పి పాడండి!" అన్నాడు వేలం వేసేవాడు.

ఎవరో నాలుగువేల దీనారాలు పాడారు. తరవాత ఇంకొకరు మరో అయిదువందలు పెంచారు.

సరిగా ఆ సమయానికల్లా వజీరు సావీ తన గుర్రంమీద అటుగా పోతూ ఆగాడు. ఎవరో బానిసను అమ్ముతున్నట్టు ఆయనకు అర్థమయింది. కొంచెం ఎడంగా వున్న అలీనూర్‌ను చూడగానే, "ఈ దౌర్భాగ్యుడు ఇక





అమ్మేదేమీ లేక తన బానిసను అమ్ముకుం టున్నట్టున్నాడు!" అనుకున్నాడు వజీరు. తరవాత ఆయన ప్రియసఖిని చూసి, అందాన్నిబట్టి ఆమె అలీనూర్ పెళ్ళాడిన బానిస అయివుండాలని కూడా తెలుసు కున్నాడు. ప్రియసఖిని చూడలేదుగాని, ఆమె అందాన్ని ప్రతివాళ్ళూ తెగపొగడటం సావీ విన్నాడు. ఇంత అందగత్తె చౌకలో అమ్ముడవుతున్న సంగతి తెలిసి ఆయనకు ఆశ పుట్టింది.

వెంటనే వజీరు సావీ వేలం వేసేవాణ్ణి పిలిచి, "ఇదుగో, ఆ బానిసను నేను కొంటాను. పాట ఎంతవరకు వచ్చిందో అంత మొత్తానికి నాకే కొట్టేయించు," అన్నాడు అధికారం కనబరుస్తూ.

వేలంవేసేవాడు ఏమీ అనలేకపోయాడు. సావీ చూడబోతే మహామంత్రి, ఆయన కెదురుగా ఏ వర్తకుడూ వేలంపాట పాడ టానికి సాహసించడు. అందుచేత వేలంవేసే వాడు వజీరుతో, "చిత్తం, తమ క్రయం ఇప్పుడే ఖాయంచేస్తాను!" అంటూ, అలీ నూర్‌వద్దకు వచ్చి, రహస్యంగా, "బాబూ, ఇవాళ మీ అదృష్టం ఏమీ బాగులేదు. ఈ దుర్మార్గుడు పాట పెరగనివ్వడు సరిగదా, ఆ ఇస్తానన్న నాలుగువేల అయిదువందలు



కూడా ఇవ్వడు. మీ ప్రాణం విసిగినదాకా తిప్పిస్తాడు!" అన్నాడు.

అలీనూర్‌కు పట్టరాని ఆగ్రహం వచ్చింది. "ఏదైనా ఉపాయం వుంటే చెప్పు!" అన్నా డతను వేలంవేసే వాడితో.

"ఒకటే ఉపాయం! మీ బానిసను శిక్షించటానికిగాను బజారులో నిలబెట్టి వేలంపాడించినట్టు నటించండి. ఆమెను అమ్మే ఉద్దేశంలేదని వజీరుగారితో చెప్పి మీ బానిసను మీరు పట్టుకుపొండి!" అని వేలం వేసేవాడు అలీనూర్‌తో చెప్పి, ప్రియసఖిని వెంటబెట్టుకుపోయి వజీరుకు వప్పగించి, తరవాత వజీరుతో, "అయ్యా, ఈ బానిస

యజమాని వస్తున్నాడు. అతనితో మిగిలిన విషయాలు పరిష్కరించుకోండి!" అన్నాడు.

ఇంతలో అలీనూర్ వచ్చాడు. అతను ప్రియసఖి చెంపమీద చెళ్ళున ఒక దెబ్బ వేసి, "బానిసదానా! ఇప్పటికైనా బుద్ధి వచ్చిందా? ఇక ఇంటికి పద! మరొకసారి నేను చెప్పినట్టు వినకపోయావో, నిన్ను నిజంగానే అమ్మేస్తాను!" అని అరిచాడు.

వజీరు నిర్ఘాంతపోయి, "ఏమిటిది? నేను దీన్ని కొన్నాను! ఇది నాది!" అన్నాడు.

"నేను అమ్మందే నువ్వెలా కొన్నావు? పదపద!" అన్నాడు అలీనూర్.

"మీరంతా న్యాయం చెప్పండి! ఈ బానిస నాది! అవునా, కాదా?" అంటూ వజీరు ప్రియసఖి చెయ్యి పట్టుకున్నాడు.

చుట్టూ ఉన్నవారంతా తన అధికారానికి వెరిచి తనను బలపరుస్తారని వజీరు నమ్మకం. అయితే వారికి అలీనూర్‌పైన ఆదరం హెచ్చు. అందుచేత ఎవరూ వజీరును బలపరచలేదు. ఈ సంగతి గ్రహించి అలీనూర్ వజీరు డొక్కలో గట్టిగా పొడుస్తూ, "కుక్కా! పశువా! నాసొత్తు అపహరిస్తావురా? పో, దిక్కున్నచోట చెప్పుకో!" అని అంతగొప్ప వజీరునూ చావ చితక తన్నేసి, ప్రియసఖిని వెంటబెట్టుకుని నేరుగా ఇంటికి వెళ్లిపోయాడు. వజీరు వెంటఉన్న బానిసలు కత్తులు దూసి అలీనూర్‌ను వెంబడించ యత్నించారు గాని, అక్కడ చేరిన జనం అడ్డుకుని, వారి ప్రయత్నాలను పూర్తిగా భంగపరిచేశారు.

ముక్కు వెంట రక్తం కారుతూ దుమ్ములో పడిపోయిన వజీరు సావీ లేచి, తనకు జరిగిన అత్యాచారాన్ని గురించి సుల్తానుగారితో చెప్పటానికి బయలుదేరాడు. వెనకనుంచి జనం ఆయనను చూసి విరగబడి నవ్వుకున్నారు.

ఇంతకాలానికి ఆ దుర్మార్గుడికి తగిన శిక్ష చేసిన అలీనూర్ మీద వారందరికీ గౌరవం పెరిగింది. (ఇంకా వుంది)





# ధీరానందుడు

పూర్వం దండకారణ్యంలో యోగానందుడనే మహా సిద్ధుడు గోదావరీ తీరాన ఆశ్రమం కల్పించుకుని ఉంటూ ఉండేవాడు. యోగ విద్యలో ఆయనవద్ద శిక్షణ పొందటానికని అన్ని కులాలవాళ్ళూ వచ్చి ఆయనకు శుశ్రూష చేస్తూండేవారు. ఒక సంవత్సరం పాటు పరీక్షించినమీదట వారు తనవద్ద యోగవిద్య నేర్చుకోవటానికి అర్హులని తోచినట్టయితే శిష్యులుగా చేర్చుకునేవాడు, లేనట్టయితే ఇంటికి పంపేస్తూండేవాడు.

యోగానందుడు అప్పుడప్పుడూ తన ఆశ్రమం వదిలి అరణ్యంలో ఇతర ప్రాంతాలకు తన శిష్యులతోసహా వెళుతూ ఉండేవాడు. అక్కడ ఆయన శిష్యులు కొత్త విషయాలు నేర్చుకుంటూ ఉండేవారు; అనేక స్థలదేవతలను పరిచయం చేసుకునేవారు, అనేక రకాల బ్రహ్మరాక్షసులను లొంగదీయటం అభ్యసించేవారు.

ఒక ఏడు యోగానందుడివద్ద శిష్యత్వం చెయ్యటానికి ధీరసింహుడనే క్షత్రియ కుమారుడు వచ్చాడు. ఇతను చిన్నవాడైనా అనేక యుద్ధాలలో ఆరితేరినవాడు. అతనికి భయమనేది ఎలా ఉంటుందో తెలియదు. అందరిలాగే అతనుకూడా ఒక ఏడాది పరీక్షకింద ఉన్నాడు. ఏడాది పూర్తి కావచ్చింది.

ఆ సమయంలో యోగానందుడు తన శిష్యులతోసహా బయలుదేరి ఒక సరస్సు వద్దకు వెళ్లి చేరాడు. సరస్సు ఒడ్డున చిన్న పర్ణశాల వేశారు.

ఈ పర్ణశాలకు కొంత దూరంలో ఒక పెద్ద మర్రిచెట్టున్నది. అది ఒక వంద ఎకరాలు ఆక్రమించి ఉన్నది.

సరస్సువద్దకు చేరిన రాత్రి యోగానందుడు తన శిష్యులతో, "ఈ మర్రిచెట్టు బహుపురాతనమైనది. దీనికింద త్రేతాయుగం నాటి పిశాచాలుకూడా ఉన్నాయి. వాటి

టి. విమలాదేవి



సంగతి తరవాత నింపాదిగా చెబుతాను. ఈ రాత్రికిమటుకు మీలో ఎవరుకూడా ఆ మర్రిచెట్టు చాయలకు వెళ్ళవద్దు. గుర్తుంచు కోండి, ఇది నా ఆజ్ఞ!" అన్నాడు.

ఆ రాత్రి అందరూ భోజనాలు చేసి పడు కుని నిద్రపోయారు. అందరితోబాటు ధీర సింహుడుకూడా నిద్రపోయాడు. కాని ఒక రాత్రివేళ అతనికి మెలకువ వచ్చేసి, తిరిగి ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. అతను ఆశ్రమం బయటికి వచ్చి అంతదూరాన ఉన్న పిశాచాల మర్రిని చూశాడు.

ఎన్నడూ భయం ఎరగనివాడు కావటం చేత అతను ఆ చెట్టుకిందికి వెళ్లదలుచు కుని బయలుదేరాడు. మర్నాడు గురువు గారు చెప్పేలోపుగానే ఆ చెట్టుగురించి కొన్ని విషయాలైనా స్వయంగా తెలుసుకోవా లని అతనికి అపుకోరాని కోరిక పుట్టింది.

అతను మర్రిచెట్టును సమీపించి దాని కిందుగా, ఊడల మధ్యగా నడవసాగాడు. అతను కొంతదూరం వెళ్ళేసరికల్లా ఒక ఊడనుంచి దిగుతూ ఒక తెల్లని ఆకారం కనిపించింది. అది నేలకు దిగి నిలబడగానే ధీరసింహుడు గంభీరంగా, "ఎవరు నువు?" అని ప్రశ్నించాడు.

"నా పేరు అనుకంపనుడు. ఈ అర ణ్యంలో రాముడి భార్య సీత ఉన్నదని రావణుడికి చెప్పినవాణ్ణి నేనే!" అన్నాడు ఊడ దిగినవాడు.

ధీరసింహుడు చలించలేదు. "నువు ఇంకా ఇక్కడే ఉంటున్నావా?" అని అతను అనుకంపనుణ్ణి అడిగాడు.

"ఎక్కువగా నరకంలో ఉంటూంటాను. వాళ్ళు రానిచ్చినప్పుడు ఈ చెట్టుమీదికి వస్తూంటాను," అన్నాడు అనుకంపనుడు, మెల్లిగా దగ్గిరికి జరుగుతూ.

"ఓహో, నరకంలో మీ వాళ్లంతా ఎలా ఉన్నారు?" అన్నాడు ధీరసింహుడు, ఎంతో ధైర్యంగా వున్నచోటనే నిలబడి. అను

కంపనుడు తనను మెల్లిగా సమీపిస్తూ ఉండటం అతను చూస్తూనే ఉన్నాడు.

"ఎలా ఉన్నారని చెప్పను! నరక జ్వాలలలో మగ్గి నానా సతమతమూ అవుతున్నారు," అన్నాడు అనుకంపనుడు.

"నరకబాధకు అందరికన్న ఎవరు బాగా తట్టుకుంటున్నారు!" అన్నాడు ధీరసింహుడు.

"అందరికన్న రావణుడు మెరుగు," అన్నాడు అనుకంపనుడు.

"రావణుడికి ఏమి శిక్ష విధించారేం?" అన్నాడు ధీరసింహుడు.

"నూనెభాండీలను కాచమన్నారు!"

"అదేమంత కష్టమైన పని కాదే?"

"నూనెభాండీల కింద కాలుతున్నది రావణుడే!"

"అలా చెప్పు! అది నిజంగా బాధే. అయితే, నరకబాధను బొత్తిగా భరించలేకుండా ఉన్నవాడెవడు?" అని ధీరసింహుడు అడిగాడు. అనుకంపనుడు కొంచెంకొంచెమే తనకు దగ్గిరిగా జరుగుతూండటం అతను గమనిస్తూనే ఉన్నాడు. కాని, అతడు ఏమాత్రం భయం కనబరచలేదు.

"కుంభకర్ణుడు నరకబాధ ఏమాత్రమూ భరించలేక రాత్రింబగళ్ళు ఒకే తీరున



రంకెలు పెట్టి, మిగిలినవాళ్లకి నిద్రలేకుండా చేస్తున్నాడు," అన్నాడు అనుకంపనుడు.

"కుంభకర్ణుడికి ఏమి శిక్ష ఇచ్చారేం?" అన్నాడు ధీరసింహుడు.

"చీలమండలదాకా నిప్పుపెట్టారు."

"ఆ బాధకే రంకెలు పెడుతున్నాడా?" అన్నాడు ధీరసింహుడు ఆశ్చర్యంగా.

"నిప్పులో కుంభకర్ణుడు తలకిందులుగా వేళ్ళాడుతున్నాడు."

"అలా చెప్పు! అది నిజంగా బాధే. అయితే కుంభకర్ణుడు పెట్టే రంకెలు ఎలా ఉంటాయో నాకు వినిపించగలవా?" అని ధీరసింహుడు అడిగాడు.

"ఓ, వినిపిస్తాను!" అంటూ అనుకంపనుడు గూబలు అదిరేటట్టుగా భయంకరమైన రంకెపెట్టాడు. ధీరసింహుడు చెవులు గట్టిగా మూసుకోవలసి వచ్చింది.

"ఇంతేనా? గట్టిగా గొర్రె అరిచినంత కూడా లేదే! కుంభకర్ణుడి రంకె నీకు సాధ్యం కాదేమో?" అన్నాడు ధీరసింహుడు.

"ఈసారి విను!" అంటూ అనుకంపనుడు భూమి దద్దరిల్లేటట్టు మరొక రంకె పెట్టాడు. ధీరసింహుడు చెవులు రెండూ గట్టిగా మూసుకున్నప్పటికీ అతని తల దిమ్మెక్కిపోయింది.

"ఇంతేనా? గట్టిగా గుర్రం సకలించినట్టుకూడా లేదు. కుంభకర్ణుడు ఇంతకన్న పెద్ద రంకెలే పెట్టిఉంటాడు. వాటిని నువు చూపించలేకుండా ఉన్నావు!" అన్నాడతను.

"ఈసారి విను!" అంటూ అనుకంపనుడు ఊపిరి బాగా పీల్చి బ్రహ్మాండమైన పెడబొబ్బ పెట్టాడు. ధీరసింహుడు చెవులు ఎంత గట్టిగా మూసుకున్నా ప్రయోజనం లేకపోయింది. అతనా పెడబొబ్బకు స్పృహ తప్పి పడిపోయాడు.

అదే సమయమనుకుని అతన్ని మింగటానికి అనుకంపనుడు ఒక్క అడుగు ముందుకు వేశాడు. కాని ఈ లోపుగా అనుకంపనుడు పెట్టిన పెడబొబ్బలు విని యోగానందుడు మేలుకుని, ఆశ్రమంనుంచి వేగంగా వచ్చి, తన కమండలంలోని జలాన్ని అనుకంపనుడిపై చల్లాడు. ఆ దెబ్బతో అనుకంపనుడు భూమిలో దూరి పాతాళానికి పారిపోయాడు.

తరవాత యోగానందుడు ధీరసింహుణ్ణి లేపి తన ఆశ్రమానికి తీసుకుపోయి జరిగినదంతా విని, "నాయనా, నా ఆజ్ఞ మీరినప్పటికీ నీ ధైర్యానికి మెచ్చాను. నేటినుండీ నీవు ధీరానందుడని పేరుపెట్టుకుని నా శిష్యుడివికా!" అని అతనికి యోగం ఉపదేశించాడు.






## 9

[సూర్యభగవానుడి పశువులను చంపి తిన్న పాపాన రూపధరుడి అనుచరులందరూ, నౌకతో సహా, సముద్రం పాలయారు. రూపధరుడు ఒంటరిగా ఒక తీరాన వచ్చిపడి, ఆవేశాన్ని ఏలే మహామేధి మహారాజుకుమార్తె అయిన వారుణి సహాయంతో రాజభవనం చేరుకుని ఆశ్రయం సంపాదించుకున్నాడు. మహామేధి రూపధరుడికి అన్నివిధాలా తోడ్పడతానని మాట ఇచ్చాడు. ఆ రాత్రి రూపధరుడు సుఖంగా నిద్రపోయాడు.]

మర్నాడు తెల్లవారింది. మహామేధితోబాటే రూపధరుడుకూడా నిద్రలేచాడు. ఇద్దరూ కలిసి సభాభవనానికి వెళ్ళారు. ఈ సభా భవనం ఓడలరేవుకు సమీపంలోనే ఉన్నది. అందులో నున్నని రాతితోచేసిన ఆసనా లున్నాయి. మహామేధి ఒక ఆసనంపై కూచుని రూపధరుణ్ణి తన పక్కనే కూచో బెట్టాడు. ఈ లోపుగా రాజుగారి భటుడొకడు రూపధరుడి ప్రయాణపు ఏర్పాట్లు చూడ టానికి నగరంలోకి వెళ్ళాడు. అతను పెద్దల నందరినీ పేరుపేరునా సభాభవనానికి ఆహ్వా నించి, ఎవరో అపూర్వ పురుషుడు రాజు గారికి అతిథిగా వచ్చినట్టు తెలియజేశాడు.

ఈ కొత్త వ్యక్తిని చూడటానికి పెద్ద లందరూ వెంటనే బయలుదేరి వచ్చారు. త్వరలోనే సభాభవనంలోని ఆసనాలన్నీ భర్తీ అయాయి. అక్కడ సమావేశమైన వారితో రాజు ఇలా అన్నాడు:




"మహాజనులారా, నాపక్కన ఆసీనుడై ఉన్న వ్యక్తి నా ఇంటికి అతిథిగా వచ్చాడు; ఆయన ఎవరో నాకు తెలియదు. ఆయన సముద్రంమీద వచ్చాడు: ఆయన తూర్పు నుంచి వచ్చాడో, పడమటనుంచి వచ్చాడో కూడా నాకు తెలియదు. అయితే ఆయన తన ప్రయాణానికి సహాయం చెయ్యమని నన్ను కోరాడు. దానికెన్నడూ అభ్యంతరం లేదు, ఎందుకంటే నాయింటికి అతిథిగా వచ్చి అసంతృప్తితోవెళ్ళిపోయిన వారెవరూ లేరు. కనుక మనం మన ఆచారం తప్పకుండా ఈ వ్యక్తికి సహాయం చెయ్యవలసి ఉన్నది. మనం ఒక కొత్త నౌకను ఈయన పరంచేసి తెడ్లువేసేవారిని యాభైఇద్దరిని తోడు ఇద్దాం. తెడ్లు వెయ్యటంలో సమర్థులైనవారు బయలుదేరి వెళ్ళి నౌకలో తెడ్లు అమర్చి భోజనానికి మాయింటికి వచ్చేయండి. మిగులిన పెద్దలు కూడా మా ఇంటికే విందుకు రావాలి. విందు ఏర్పాట్లు పెద్ద ఎత్తున చేయిస్తాను. విందు సమయంలో వినోదంగా పాడటానికిగాను తగిన మనిషినిచూసి పిలిపించండి."

మహామేధి మహారాజు సభికులతో ఈ మాటలు చెప్పి, రూపధరుణ్ణి వెంట తీసుకుని తన భవనానికి బయలుదేరి వెళ్ళాడు. వెంటనే పాడేవారికి కబురు వెళ్ళింది. యాభై ఇద్దరు సమర్థులైన నావికులు కొత్తపడవను జలప్రవేశం చేయించి, తెడ్లు అమర్చారు. దానికి వారు ఒక తెల్లని తెరచాప ఎత్తి, నౌకను లోతునీటిలో లంగరువేసి రాజభవనానికి వెళ్ళారు.

రాజభవనంలోని గదులు, చావడులూ, ప్రాంగణాలూ అతిథులతో నిండిపోయాయి. విందుకుగాను గొర్రెలనూ, అడవి పందులనూ, ఎద్దులనూ కోశారు. విందుసమయంలో పాడటానికి ఒక అంధగాయకుడు పిలిపించబడ్డాడు.

అందరూ భోజనాలుచేసే సమయంలో ఆయన పాడిన పాట రూపధరుడి జీవితంలో



జరిగిన సంఘటనకు సంబంధించినదే. ఆ సంఘటన ఏమంటే –

ట్రోయ్ యుద్ధం ఇంకా ఆరంభం కాలేదు. రారాజు భవిష్యత్తు తెలుసుకునే నిమిత్తమై మైథోవద్ద ఉన్న సూర్యాలయానికి వెళ్లాడు. "ట్రోయ్ పతనమయేలోపుగా నీ యోధుల మధ్య కలహం జరుగుతుంది," అని సూర్య భగవానుడు రారాజుకు తెలియజరిచాడు. అలాగే జరిగిందికూడా. ఒకనాడు భోజనాల దగ్గిర రూపధరుడూ వజ్రకాయుడూ తగాదా పడి ఒకరినొకరు గట్టిగా తిట్టుకున్నారు. రారాజు ఈ తగాదా చూసి విచారించటానికి బదులు చాలా సంతోషించాడు. ఎందు చేతనంటే ఇది తనకు శుభసూచకమని సూర్యభగవానుడు అదివరకే చెప్పి ఉన్నాడు.



అంధగాయకుడు ఈ విందులో పై సంఘటనను పాటకట్టి పాడాడు. కాని ఈపాట వింటుంటే రూపధరుడికి దుఃఖావేశం ముంచుకువచ్చింది. తనకంటినీరు ఇతరులు చూసిపోతారని అతను తన ముఖాన్ని బట్ట కొంగుతో కప్పేసుకున్నాడు. మధ్యమధ్య గాయకుడుపాట నిలిపినప్పుడు రూపధరుడు తన కళ్ళు తుడుచుకుని ముఖానికి అడ్డం తొలగించేవాడు. మళ్ళీ గాయకుడు పాట ఆరంభించగానే అతనికి కంటివెంట అశ్రు ధారలు కారేవి, అతను ముఖాన్ని తిరిగి బట్టతో కప్పేసుకునేవాడు.

రూపధరుడి చర్యలను ఇతరులెవరూ గమనించలేదు గాని, అతని పక్కనే కూచుని భోజనం చేస్తున్న మహామేధి గమనించాడు. రూపధరుడు బాధతో మూలగటంకూడా ఆయనకు వినిపించింది.

చిట్టచివరకు మహామేధి తన అతిథులతో, "మిత్రులారా, మనం కడుపునిండా భోజనం చేశాం. ఇక ఈ పాట చాలించి, మనం వ్యాయామక్రీడలు ప్రదర్శింతాం. మల్ల యుద్ధంలోనూ, దూకటంలోనూ మన ప్రజ్ఞ ఎంత అసాధారణమైనదో మన అతిథిచూసి



నట్టయితే ఆయన తన దేశవాసులకు చెప్పగలుగుతాడు!" అన్నాడు.

రాజుగారు లేవగానే అందరూ లేచి మైదానానికి బయయిదేరారు. అక్కడ అనేకవేల మంది గుమి కూడారు. వ్యాయామక్రీడలలో ఆరితేరిన యువకులంతా పోటీలలో పాల్గొనటానికి సిద్ధంగా ఉన్నారు. మొదట పరుగు పందెం జరిగింది. తరవాత మల్లయుద్ధమూ, దూకటమూ, బరువు విసరటమూ మొదలైనవి జరిగాయి. అన్నిపందాలలోనూ తలా ఒకరూ గెలిచారు. మల్లయుద్ధంలో రాజు కొడుకు గెలిచాడు. అతను తన అనుచరులతో, "ఒరే, మన అతిథి చిన్నతనంలో ఏయే వ్యాయామక్రీడలు అభ్యసించాడో తెలుసుకుందామా? మనిషి చూడటానికి దృఢంగానే ఉన్నాడు. తొడలూ, పిక్కలూ, మెడా బలిష్ఠంగా ఉన్నాయి. చేతులు దృఢంగా ఉన్నాయి. వయసుకుకూడా ముదిసినవాడేమీ కాదు!" అన్నాడు.

రాజకుమారిడితో అతని అనుచరులు, "భేష్! నువే వెళ్లి ఆయనను ప్రశ్నించి, పోటీకి పిలు!" అన్నారు. అతను రూపధరుణ్ణి సమీపించి, "అయ్యా, మీకు వ్యాయామక్రీడలతో పరిచయం ఉన్నట్టయితే ఆటలలోకి రండి. ప్రతి మనిషికీ వ్యాయామ క్రీడలు తెలిసివుండాలి. మీరు నిరుత్సాహంగా





వుండవలిసిన పనిలేదు; మీకోసం నౌకా, నావికులూ కూడా సిద్ధంగా వున్నారు," అని చెప్పాడు.

"అలా ఎందుకంటావు, నాయనా? మీరంతా నన్ను వేళాకోళం పట్టిస్తున్నారు లాగుంది. నా మనస్సులో ఇప్పుడు కష్టాలకు తప్ప, ఆటలకు చోటులేదు. మీ అతిథిగా నేనీ ఆటలపోటీలు చూస్తున్నానేగాని, చూసి ఆనందించటానికి కాదు. నాకు కావలిసిందల్లా మా ఇల్లు చేరటమే!" అన్నాడు రూపధరుడు.

అతన్ని రెచ్చగొట్టే ఉద్దేశంతో ఇంకొక యువకుడు రూపధరుడితో, "కాకపోయినా మీ అవతారం చూస్తే వ్యాయామక్రీడలు తెలిసినట్టు లేదులెండి! ఏ వర్తక నౌకనో నడుపుకుంటూ, బేళ్లు లెక్కించటమూ, జమా ఖర్చులు చూసుకోవటమూ, లాభాలు కూడుకోవటమూ మాత్రమే చాతనయిన మనిషిలాగా కనబడతారు!" అన్నాడు.

రూపధరుడికి నిజంగానే కోపం వచ్చింది. అతను కనుబొమలు ముడివేసి, "అబ్బాయీ, కొందరిని భగవంతుడు వికారంగా సృష్టిస్తాడు, కాని వారు నోరు తెరిస్తే ముత్యాలు రాలుతాయి. వారి మాటలు వినటానికి ప్రజలు ఎగబడతారు. మరికొందరు చూడటానికి అందంగానే వుంటారు గాని వారు

నేను విప్పితే అందరూ చెవులు మూసుకో వలసిందే. భగవంతుడు నీకు అందం ఇచ్చాడుగాని మెదడు ఇవ్వలేదు. నేను చాలా కష్టాలుపడి శుష్కించి వున్నాను. అయినా నాకేపాటి శక్తి ఉన్నదో చూపి స్తాను," అంటూ చివాలున తనువున్న ఆసనంమీది నుంచి లేచి ఒక పెద్ద రాతి గుండు తీసుకుని తన తలపైన ఒకచుట్టు తిప్పి, బలంకొద్దీ విసిరాడు.

దూరం కొలిచే కుర్రవాడు ఆ గుండు పడిన చోటికి వెళ్ళి దూరంకొలిచి, "అయ్యా, మిగిలినవాళ్ళు విసిరిన గుండ్లన్నిటికన్నా మీరు దూరం విసిరారు. ఇంతదూరం మరెవ్వరూ విసరలేరు, మీరు నిశ్చింతగా వుండవచ్చు!" అని కేకపెట్టాడు.

రూపధరుడికి ఈ మాటలు విని ఆనందం కలిగింది. అతను ఉత్సాహంతో, "అబ్బా యిలూ, చాతనయితే మీరు నాతో పోటీపడి గుండు విసరండి! నేను ఇందులోకి దిగనే దిగాను గనక వెనక్కు తగ్గేదిలేదు. మల్ల యుద్ధమైనాసరే, పరిగెత్తటమైనాసరే—ఎవరు వస్తారో రండి! నాకు విలువిద్యకూడా చాత నవును. యుద్ధరంగంలో ఆ విద్యలో నాకన్న సమర్థుడు ధనధవుడు ఒక్కడే వుండేవాడు. దేవతల మాట చెప్పనుగాని, మానవమాత్రు




లతో ఎవరితోనైనా ఏ విద్యలోనైనా పోటీకి నేను సిద్ధమే!" అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు.

మహామేధి రూపధరుడికేసి తిరిగి, "అయ్యా, మనలను ఇంకొకరు చులకన చేసి మాట్లాడినప్పుడు మన గొప్ప మనం చెప్పుకుంటే అందులో తప్పేమీలేదు. మీ శక్తిసామర్థ్యాలను శంకించే అర్హత ఇక్కడ ఎవరికీ లేదు. మాకు కావలిసినదల్లా మీరు ఇక్కడ కొంత ఆనందంపొంది వెళ్లటమే. కొన్ని విద్యలలో మేము ఘటికులం. మల్ల యుద్ధంలోనూ, ఇతర వ్యాయామక్రీడల లోనూ మాకు ప్రత్యేకమైన నేర్పు లేదు.

మాకు నేర్పున్నది నౌకలు నిర్మించటంలో, నౌకలు నడపటంలో, పాటలు పాడటంలో, నృత్యం చెయ్యటంలో. వీటిని మీరు తిలకించాలని నా కోరిక. స్వగృహం చేరుకుని మీ భార్యాబిడ్డలమధ్య సుఖంగా కూచుని వున్న సమయంలో వీటిని జ్ఞాపకం చేసుకోవటమే మాకు కావలిసినది!" అన్నాడు.

తరవాత నృత్యగానాలు ఏర్పాటుచేశారు. ఆ దేశంవారు చేసిన బృందనృత్యాలు చూసి రూపధరుడు అద్భుతంచెందాడు. అతను మహామేధితో, "మహారాజా, ఇంత అద్భుతమైన నృత్యాలు నేనెక్కడా చూడలేదు," అన్నాడు వుత్సాహంగా.

తన అతిథి ఆ మాట అనేసరికి రాజు పరమానందంచెందాడు. ఆయన తన దేశంలో ఉన్న పన్నెండుమంది రాజకుమారులను పిలిచి, వారిచేత తన అతిథికి మంచి బట్టలు పెట్టించి, బంగారం బహుమానంగా ఇచ్చాడు. రూపధరుణ్ణి కవ్వించిన యువకుడు, దంతపు ఒరా, వెండి పిడీగల తన కత్తిని రూపధరుడికి బహూకరించాడు.

ఆ రాత్రి భోజనాల దగ్గిర అంధగాయకుడు "కొయ్యగుర్రం" కథ గానం చేశాడు. గ్రీకులు తమ శిబిరాన్ని తగలబెట్టి తమ నౌకలలో వెళ్లిపోవటంతో కథ ఆరంభమయింది. తరవాత ట్రోజనులు కొయ్యగుర్రాన్ని నగరంలోకి తీసుకుపోవటం మొదలైన వివరాలు వింటూ రూపధరుడు విచారంతో కుంగిపోయి ఏడవసాగాడు.

అది గమనించి మహామేధి పాట నిలుపు చేయించి, రూపధరుడికేసి తిరిగి, "అయ్యా, దాచకుండా నిజం చెప్పండి. మీరెవరు? మీపేరేమిటి? ఊరేమిటి? మీది ఏదేశం? మీరు ఎక్కడినుండి వస్తున్నారు? ట్రోయ్ యుద్ధం కథ మీకెందుకు విచారం కలిగిస్తున్నది? ఆ యుద్ధంలో మీ ఆప్తులెవరైనా మరణించలేదుగద!" అన్నాడు.

(ఇంకా ఉంది)






# 7

[రాజుకూతురు బుదూర్‌కూ మంత్రికొడుకుకూ జరగవలసిన వివాహాన్ని అలాదీన్ రెండోకంటివాడికి తెలియకుండా భగ్నం చేసి, రాజుగారు పెట్టిన గడువు తీరగానే, రాజకుమార్తెను తనకిచ్చి వివాహం చేయమని తల్లిద్వారా కబురుచేశాడు. మంత్రి సలహాతో రాజుగారు తన కుమార్తెకు వల్లమాలిన రత్నరాసులు కట్నం కోరాడు. దీపం భూతం సహాయంతో అలాదీన్ కట్నం పంపాడు. తరవాత రాజుగారు అలాదీన్‌ను పిలిపించి ఘనంగా స్వాగత మిచ్చాడు.]

సభాభవనంలోనే రాజుగారికీ అలాదీన్‌కూ భోజనం ఏర్పాటయింది. మంత్రి స్వయంగా వారికి పరిచర్య చేశాడు. మిగిలిన సభికు లంతా అక్కడే ఉన్నారు.

భోజనం పూర్తికాగానే రాజుగారు పురోహితులు మొదలైన వారిని పిలిపించి తన కుమార్తెను అలాదీన్ కిచ్చి పెళ్లిచేసే విషయం స్థిరపరిపించాడు. తరవాత ఆయన అలాదీన్‌ను, "నాయనా, పెళ్లిముహూర్తం ఎప్పటికి ఏర్పాటు చేయమన్నావు?" అని అడిగాడు.

"మహారాజా, ముహూర్తం ఇప్పుడు ఏర్పాటుచేసినా నాకు సమ్మతమే. కాని నేనూ నా భార్యా కాపరం ఉండటానికిగాను ఒక అద్భుత భవనం నిర్మించాలనే ఉద్దేశంతో ఉన్నాను. ఆ భవనం తయారుకాగానే

బి. ప్రసాదరావు



నేను పెళ్లి చేసుకుంటాను!" అన్నాడు అలాదీన్.

"ఈ భవనం ఎక్కడ నిర్మిస్తావు?" అని రాజు అడిగాడు.

"తమ సెలవైతే, రాజభవనానికి ఎదురుగా ఉన్న విశాలమైన ఆవరణలో నిర్మిస్తాను. మీ కుమార్తె మీకు ఎంత దగ్గిరలో ఉంటే అంత మంచిదిగదా! నేనుకూడా తరుచు తమ దర్శనం చేసుకుంటూ ఉండవచ్చు," అన్నాడు అలాదీన్.

"ఇందుకు నా అనుమతి వేరే కోరాలా? నీ యిష్టం వచ్చిన చోట కట్టుకో! కాని పని త్వరగా ముగిసేటట్టు చూడు. నా కుమార్తె ఎప్పుడు పెళ్లాడుతుందా, ఎప్పుడు మనమలను ఎత్తుకొంటానా అని నేను తొందరపడుతున్నాను," అన్నాడు రాజు.

అలాదీన్ ఈ మాటలు విని చిరునవ్వు నవ్వి, రాజుగారివద్ద సెలవుతీసుకుని తన ఇంటికి వచ్చేశాడు. అతను ఇల్లు చేరుతూనే తల్లితో జరిగిన విషయాలన్నీ చెప్పి, తన గదిలోకి వెళ్లి తలుపువేసుకుని, దీపాన్నితీసి రుద్ది, భూతాన్ని ఆవాహనచేశాడు.

భూతం వచ్చి, "ఏం సెలవు?" అని అడిగింది.

"నా కోరికలను తీర్చటంలో నువు చాలా సమర్థత చూపిస్తున్నావు. ఈసారి ఇంకా సమర్థత చూపాలి. నేనూ నాభార్యా కాపరం ఉండటానికిగాను ఒక అద్భుతమైన భవనం రాజభవనానికెదురుగా ఉన్న ఖాళీ స్థలంలో నిర్మించాలి. దాని రచన యావత్తూ నీకే వదిలిపెడుతున్నాను; ఎక్కడ ఏ యే రత్నాలు పొదుగుతావో నువే చూసుకో. కాని భవనంమధ్యలో స్ఫటికంతో చేసిన బురుజు చాలాపెద్దది లేపి, దానికి అమర్చే స్తంభాలు వెండితోనూ, బంగారంతోనూ పోతపోసినవిగా ఉంటేటట్టు చూడాలి. ఆ బురుజుకు తొంభైతొమ్మిది గవాక్షాలు అమర్చి, వాటికి వజ్రాలూ, కెంపులూ, పచ్చలూ పొదగాలి.




తొంభైతొమ్మిదవ కిటికీకి మాత్రం రత్నాలు పొదగకుండా వదిలెయ్యి. భవనం ముందు జలయంత్రాలతోనూ, నీటి కాలవలతోనూ సహా చక్కని ఉద్యానవనం నిర్మించు. భవనం అడుగున ఒక రహస్యమైన మాళిగ నిర్మించి, దానినిండా బంగారు నాణాలు పేర్చు. ఇక, వంటఇల్లూ, అశ్వశాలా, బాని సల నివాసాలూ మొదలైనవి ఏవిధంగా ఏర్పాటు చేస్తావో చేసుకో. పని పూర్తికాగానే నాకు తెలియజెయ్యి!" అన్నాడు అలాదీన్ దీపంభూతంతో.

"చిత్తం," అని భూతం వెళ్లిపోయింది.

మర్నాడు తెల్లవారేవేళ భూతం అలాదీన్‌ను నిద్రలేపి, "తమపని పూర్తిఅయింది, వచ్చి చూసుకోండి," అన్నది. అతను సరేనన్నమీదట ఆ భూతం అతన్ని ఎత్తుకుపోయి కొత్తగా నిర్మించిన భవనాన్ని చూపింది. ఈ భవనం రాజభవనానికి ఎదురుగా, అంతకంటె చాలారెట్లు రమ్యంగా ఉన్నది. ఆ భవనానికి చేరటానికి రెండు మార్గాలు పాలరాయి పరిచివున్నాయి. భవనాన్ని బయటినుంచి చూశాక అలాదీన్ లోపలిభాగాలు చూడటానికి భూతాన్ని వెంటబెట్టుకుని వెళ్ళాడు. భవనంలోపల అతనికి తాను కలలోకూడా ఊహించలేని మహావైభవం ప్రత్యక్షమయింది. భూమిలోపల ఒక రహస్య ధనాగారం, ఎంతో విశాలమైనది, నిర్మించి వున్నది. దానినిండా బంగారు దీనారాలునింపిన సంచుల దొంతరలున్నాయి. రాజుగారి దివాణంలో ఉండదగిన వంటశాలలూ, కచ్చేరి చావడులూ, కొట్లూ, అశ్వశాలలూ, సమస్తమూ ఈ భవనంలో ఉన్నాయి. అశ్వశాలలలో మేలుజాతి గుర్రాలున్నాయి. వాటిని కాసావాళ్ళు మాలిసు చేస్తున్నారు. వాటి దాణాకు వెండి తొట్లు ఏర్పాటయాయి.

అలాదీన్ చాలా సంతోషించాడు. అతను భూతంకేసి తిరిగి, "ఒక్కటి మరిచి



73

పోయావు. నాభార్య మా యింటినుంచి రాజభవనానికి నడిచిపోవటానికి ఒక పొడుగాటి తివాసీ రెండు భవనాలకూ మధ్య పరిపించు," అన్నాడు.

"చిత్తం!" అన్నది భూతం. మరుక్షణం రెండు భవనాల మధ్యా ఒక మెత్తని తివాసీ పరిచి ఉన్నది.

"ఇప్పుడే వంకా లేదు. ఇక నన్ను మా ఇంటికి తీసుకుపో!" అన్నాడు అలాదీన్.

అతను వెళ్ళిపోయిన కొద్దిసేపటికల్లా రాజుగారి దేవిడీ తలుపులు తెరిచారు. రాజుగారి నౌకర్లూ, చాకర్లూ తమ పనులమీద రాజభవనం నుంచి బయటికి వచ్చి, ఎదురుగా ఉన్న కొత్త భవనాన్ని చూసి అశ్చర్యంతో స్తంభించిపోయారు. ఆ భవనం మాణిక్యకాంతులతో, అప్పుడే ఉదయించిన సూర్యబింబంలాగా వెలిగిపోతున్నది.

వారు వెనక్కు తిరిగి వెళ్లి ఈ వింతను మహామంత్రికి నివేదించారు. ఆయన వెళ్లి రాజుగారితో చెప్పాడు. "మహారాజా, అమ్మాయిగారిని పెళ్లాడనున్న యువకుడు ఇంద్రజాలం నేర్చినవాడులాగా కనబడుతున్నాడు," అన్నాడాయన.

"నువ్వు వట్టి మూర్ఖుడులాగున్నావు! అసూయతో నీ బుద్ధి పెడతల పట్టినట్టున్నది! అంత ధనికుడు తలుచుకుంటే ఒక్క



రాత్రిలో ఇలాటి భవనం కట్టలేడా?" అన్నాడు రాజు.

రాజుగారికి అలాదీన్‌పై పూర్ణానుగ్రహం కలిగిందనీ, అతనిపైన ఏమి చెప్పినా రాజు గారి తలకెక్కదనీ తెలుసుకుని మంత్రి మాట్లాడక ఊరుకున్నాడు.

ఈ లోపుగా అలాదీన్ యింటికి వెళ్ళి పరిచారికలచేత తల్లికి మంచి ఉడుపులు ధరింపజేశాడు. ఆమె ప్రయాణానికి సిద్ధమయాక, "అమ్మా, ఇక నీ కోడలిని ఇంటికి తెచ్చుకోవచ్చు. పోదాం, పద!" అన్నాడు.

అలాదీన్ తల్లి తన పన్నెండుగురు పరిచారికలనూ వెంటబెట్టుకుని రాజభవనానికి బయలుదేరింది. ఆమెకు కొంచెం వెనకగా అలాదీన్ తన గుర్రంమీద బయలుదేరాడు. అతనితోబాటు అతని సిబ్బందికూడా కదిలింది. రాజభవనం చేరుకున్నాక అలాదీన్ తన స్వంత భవనంకేసి వెళ్ళాడు, అతని తల్లి రాజభవనం ప్రవేశించింది.

రాజుగారు ఆమెకు ఆదరంతో స్వాగతమిచ్చి, ఆమెను రాణివాసంలోకి నౌకర్ల వెంట పంపాడు.

రాజకుమార్తె అలాదీన్ తల్లిని చూడగానే లేచివచ్చి ఎంతో వినయంగా ఆమెను ఆసనం మీద కూచోబెట్టి, ఫలహారం పెట్టించి, తాను అలంకరించుకోసాగింది.





దాసీలు రాజకుమార్తెను పెళ్ళికూతురు చేసి ఆమెకు గల సమస్త అభరణాలూ పెట్టారు. కొద్దిసేపటిలోనే రాజుకూడా వచ్చాడు. వారు తనకు చూపిన మర్యాదకు అలాదీన్ తల్లి పరవశురాలై, ఆనందాశ్రువులు రాల్చింది. వారు ముగ్గురూ ముచ్చటించుకుంటూండగా రాణీ వచ్చింది. ఆవిడ అలాదీన్ తల్లిని పలకరించలేదు, వారి సంభాషణలో ప్రవేశించలేదు. ఇంతకూ ఈ పెళ్లి రాణికి ఏమాత్రమూ ఇష్టంలేదు. తన అల్లుడు అనామకుడన్నది ఆమెను బాధించింది. అలాదీన్ విషయంలో ఆవిడ మంత్రితో ఒకటయింది.

రాజకుమార్తె అత్తవారింటికి బయలుదేరేటప్పుడు తన తల్లినీ తండ్రినీ కౌగలించుకుని కన్నీరు కార్చింది. తరవాత ఆమె తన అత్తగారివెంట బయలుదేరింది. ఆమెతోబాటు పదిమంది నౌకర్లూ, నూరుమంది దాసీలూ బయలుదేరారు. నాలుగువందల మంది బానిసలు రెండుభవనాలకూ మధ్య రెండు సోల్పులలో నిలబడ్డారు. వారి చేతులలో ఉన్న పళ్ళాలలో దీపారాధనలూ, కర్పూర హారతులూ, సాంబ్రాణి ధూపాలూ ఉన్నాయి. మంగళవాద్యాలు మోగుతూ ఉండగా, పెళ్ళికూతురు అడుగులో అడుగు వేసుకుంటూ తివాసీమీదుగా పుట్టింటినుంచి మెట్టినింటికి నడిచి వెళ్లింది. ఈ దృశ్యం చూడటానికి జనం దూరాన నిలబడి హర్షధ్వానాలు చేశారు.

అలాదీన్ చిరునవ్వు నవ్వుతూ పెళ్లికూతురికి ఎదురు వచ్చి, ఆమెను లోపలికి తీసుకువెళ్ళాడు. బురుజుకింద హాలులో, రత్నాలు తాపిన కిటికీల మధ్య అలాదీన్, అతని తల్లీ, రాజకుమార్తె విందుభోజనానికి కూచున్నారు. ఆ వాతావరణమంతా చూసి రాజకుమార్తె నిర్ఘాంతపోయింది. తాను అటువంటిచోట అడుగుపెడతానని ఆమె ఎన్నడూ అనుకుని ఉండలేదు.

భోజనం అయినాక స్త్రీలువచ్చి నృత్యాలు చేశారు. ఆ నృత్యం రాజకుమార్తెకు దేవలోక నృత్యంగా తోచింది.

మర్నాడు ఉదయమే అలాదీన్ తన గుర్రాన్ని ఎక్కి రాజభవనానికి వెళ్లి, తన మామగారిని తనఇంట విందుకు ఆహ్వానించాడు. రాజుగారిందుకు సంతోషంగా ఒప్పుకుని, "అమ్మాయి ఎలా ఉన్నది?" అని అడిగాడు. అలాదీన్ తగురీతిగా సమాధానం చెప్పాడు. తరవాత ఇద్దరూ కలిసి అలాదీన్ ఇంటికి వచ్చారు.




ఆ భవనాన్ని బయటనుంచి చూసే రాజు ఎంతో ముచ్చటపడ్డాడు, ఇక లోపలకూడా చూసినాక ఆయన ఆశ్చర్యానికి మేరలేదు. అన్నిటికన్నా ఆయనను ప్రబలంగా ఆకర్షించినది బురుజుకింద హాలు. ఆయన దాన్ని వివరంగా పరీక్షించి, "భూప్రపంచంలో ఇటువంటి కట్టడం ఇంకొకటి ఉంటుందని నాకు తోచటంలేదు. కాని, అలాదీన్, ఇక్కడ ఉన్న కిటికీలలో ఒక్కటి మాత్రం రత్నాలు తాపటం చేయకుండా వదిలేశావేమిటి? మిగిలిన వాటితో పోలిస్తే ఇది బోసిగా ఉన్నదే?" అన్నాడు.

"పిసినిగొట్టు తనంవల్ల గాని అశ్రద్ధవల్ల గాని ఆ కిటికీపని పూర్తిచేయక వదిలాననుకునేరు. ఈ భవనం నేటినుంచీ మీ అమ్మాయి నివాసమందిరం. అందుచేత దాని నిర్మాణంలో మీకుకూడా కొంతపాలు ఉంటే మీ కీర్తికూడా ఇందులో చేరి ఉంటుంది గదా అని ఆ కిటికీ అలా ఉంచేశాను. దాని పని మీరు పూర్తి చెయ్యండి!" అన్నాడు అలాదీన్.

"నిజంగా ఎంత గొప్ప ఆలోచన చేశావోయ్! ఆ పని నాకు వదిలెయ్యి!" అంటూ రాజు తన భటులను పిలిచి, "ఒరే, మన శిల్పులను పిలవండి," అన్నాడు.

తరవాత ఆయన తన కుమార్తె వద్దకు వెళ్లి ఆమెతో కాస్సేపు ముచ్చటించి, ఆమెకు

ఈ కొత్త జీవితం చాలా అనందదాయకంగా ఉందని తెలుసుకున్నాడు. తరవాత తన కూతురితో, అల్లుడితో కలిసి భోజనంచేశాడు.

ఇంతలో శిల్పులు వచ్చారు. రాజుగారు వారికి కిటికీ చూపి, "దీనినికూడా మిగిలిన కిటికీలలాగా అలంకరించండి," అని అజ్ఞాపించాడు. "చిత్తం, మహాప్రభూ!" అని వారు మిగిలిన కిటికీలన్నీ పరీక్షచేసి కంగారు పడుతూ రాజుగారి వద్దకు తిరిగి వచ్చి, "మన్నించండి, మహారాజా! మావద్ద ఉన్న రత్నాలన్నీ కలిపినా, ఈ కిటికీలో నూరో వంతు పొదగటానికి చాలవు. ఏం సెలవు?" అన్నారు వినయంగా.

రాజు తన భటులను పిలిపించి, అలాదీన్ తనకు పంపిన రత్నరాసులను తెప్పించాడు. వాటిని ఆయన శిల్పులకు చూపి, "వీటిలో కావలసినమటుకు మీరు వాడుకుని మిగతావి తిరిగి ఇచ్చెయ్యండి," అన్నాడు.

వారు కొలతలు వేసి, లెక్కలు కట్టి గుణించి, "మహారాజా, ఇవన్నీ కలుపుకున్నా కిటికీలో పదోవంతు అలంకరించటానికి సరిపోతాయి," అన్నారు.

రాజు కొంచెం కంగారుపడ్డాడు. ఆయన మళ్ళీ తన భటులను పిలిచి, "మన మంత్రి సామంతు లందరి దగ్గిరా ఎన్నెన్ని రత్నాలుంటే అన్నీ పట్టుకురండి," అన్నాడు.



భటులు వెళ్ళి కొద్దిసేపట్లో అందరివద్దా గల రత్నాలు మూటకట్టి తెచ్చారు. శిల్పులు వాటిని చూసి, "మహారాజా, ఇవికూడా కలుపుకుంటే కిటికీలో ఎనిమిదోవంతు అలంకరించవచ్చు. ఈ రత్నాలకింకా ఏడు రెట్లు తెప్పించండి. రత్నాలు రాగానే పని ప్రారంభించి మూడుసంవత్సరాలు విడవకుండా పనిచేసి ఈ కిటికీని మిగిలిన కిటికీలలాగా చేసేస్తాం!" అన్నారు.

రాజుగారికి తల తీసేసినట్టయింది. తన సామర్థ్యం ఈపాటికి రాజుగారు గ్రహించి ఉంటాడనుకొని నిశ్చయించి అలాదీన్, "మహారాజా! ఈ కిటికీ గురించి మీరిక బాధపడకండి. నేను ఇచ్చిన రత్నాలు తిరిగి తీసుకోవటం ఏమీ భావ్యంగా ఉండదు. మీ తరఫున నేనే ఆ కిటికీపని పూర్తయేలా చూస్తాను," అన్నాడు.

రాజుగారు ఒక్క నిట్టూర్పు వదిలి తన కుమార్తెతో మాట్లాడటానికి వెళ్ళాడు.

ఈ లోపుగా అలాదీన్ దీపంభూతాన్ని ఆవాహన చేసి, "తొంభైతొమ్మిదో కిటికీని కూడా మిగిలినవాటిలాగే చెయ్యి," అన్నాడు.

కొద్ది క్షణాలలో ఆ కిటికీకూడా రత్నఖచితమైపోయింది. తరవాత రాజుగారు ఆ హాలులోకి అడుగుపెట్టి తొంభైతొమ్మిదో కిటికీని గుర్తించలేక పోయాడు. ఆ హాలు



చుట్టూ ఎన్నోసార్లు తిరిగినమీదట ఆయ నకు ఆ కిటికీ పని పూర్తి అయినట్టు బోధ పడింది. ఆయన అలాదీన్‌కేసి తిరిగి, "అలా దీన్, నిన్ను చూస్తున్నకొద్దీ నాకు ఆశ్చర్యం హెచ్చిపోతున్నదిసుమా!" అన్నాడు.

రాజు తన మంత్రికేసి తిరిగి, "ఇప్పుడే మంటావు?" అని వెటకారంగా అడిగాడు. "అంతా ఈశ్వర చిద్విలాసం!" అన్నాడు మంత్రి. కాని అలాదీన్ మాంత్రికుడనీ, దుష్ట శక్తులను వశపరచుకున్నవాడనీ మంత్రికి లోలోపల అనుమానం ఉండనే ఉన్నది.

ఇది మొదలు రాజుగారు ప్రతి సాయం కాలమూ తన కూతురి ఇంటికి వచ్చి అల్లుడి తోనూ, కూతురితోనూ కాలక్షేపం చేయ సాగాడు. వారి భవనాన్ని రోజూ చూస్తు న్నప్పటికీ ఆయనకు అందులో ఏవో కొత్త వింతలు కనిపిస్తూనే ఉండేవి.

తాను ఇంతగా పైకి వచ్చినప్పటికీ అలా దీన్ ఉబ్బితబ్బిబ్బు కాలేదు. అతను తన చిన్నతనపు బీదరికాన్ని ఏమాత్రమూ మరవ లేదు. అందుచేత అస్తమానమూ పేదల స్థితి బాగుచేయటానికి కృషిచేస్తూ, వారికి అనేక విధాల సహాయపడుతూ ఉండేవాడు. అతను వీధులవెంట వెళ్ళినప్పుడల్లా అతని బాని సలు బంగారం విరజిమ్ముతూ ఉండేవారు. అతని భవనంలో ఉదయమూ సాయం కాలమూ అయిదువేలమంది అన్నార్తులకు అన్నదానం జరిగేది. అంత గొప్పవాడైకూడా అతనిలో గర్వం లేశమైనా లేకపోవటంచేత అతనంటే గొప్పవారికీ, కొద్దివారికీకూడా ఎంతో అభిమానంగా ఉండేది.

ఇక అతని భార్య సంగతి చెప్పనే అక్క ర్లేదు. ఏదో పూర్వపుణ్యంవల్ల తనకు ఈ భర్త దొరికాడనీ, ఇలాటివాడు ప్రపంచంలో మరొకడు ఉండడనీ ఆమె మనస్ఫూర్తిగా నమ్మింది. అలాదీన్ ఆ భార్యతోనూ, తన తల్లితోనూ సుఖంగా జీవితం వెళ్ళబుచ్చ సాగాడు.

—(ఇంకా వుంది)



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1958 మే సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అస్వతంత్ర జీవులం

రెండవ ఫోటో : అందమైన బాలలం

పంపినవారు : జలసూత్రం రామకృష్ణశాస్త్రి,

క్లార్కు, డిస్ట్రిక్టుబోర్డ్ ఆఫీసు, కృష్ణా, చిలకలపూడి - (ఆంధ్రప్రదేశ్)

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# "జెల్లీ" చేపలు

సముద్రంలో అతి పురాతనమైన జీవరాసులెన్నో ఉన్నాయి. ఇందులో ఆశ్చర్యం లేదు. ఎందుచేతనంటే మొట్టమొదట ప్రాణుల ఉత్పత్తి జలంలోనే జరిగింది. ప్రాణుల పరిణామం చాలాదూరం సాగినాక గాని భూచరాలు పుట్టలేదు.

సముద్రంలో ఉండే అనేక వింత ప్రాణులలో జెల్లీచేపలు ఒక జాతి. ఇవి కేవలం నీటిబుగ్గలని చెప్పవచ్చు. వీటిని బయటికి తీసినట్టయితే కొద్దిసేపటిలో నీరుగారి పోతాయి. పదార్థం అటేమిగలదు.

ఇవి నిజమైన చేపలు కావు. పరిణామంలో ఇవి నీటి పురుగులకన్నకూడా ప్రాచీనమైనవి.

ఈ జెల్లీచేపలకు కళ్ళూ, చెవులూ, అస్థిపంజరాలూ ఉండవు; స్పర్శజ్ఞానం మాత్రమే ఉంటుంది.



"సింహం జూలు"

సాధారణంగా వీటి శరీరాలు గుండ్రగాగాని, గొడుగు ఆకారంలో గాని ఉంటాయి. వీటి శరీరం యావత్తూ జీర్ణకోశమే అని చెప్పవచ్చు. ఈ శరీరం, మన ఊపిరి తిత్తులలాగా, పెద్దది అవుతూ, ముడుచుకుంటూ ఉంటుంది. శరీరం పెరిగినప్పుడు నీటిలోపలికి పోతుంది, మళ్ళీ ముడుచుకున్నప్పుడా నీరు పైకి చిమ్ముతుంది. అలా నీరు చిమ్మటంద్వారా "జెల్లీ" చేప కదులుతుంది.

దీని శరీరానికి అంటుకుని అనేక దారపు పోగులలాటి సరాలుంటాయి. అందుచేత వాటిని రాచుకున్న ప్రాణికి అపాయం కలుగుతుంది. ఈ సరాలు "జెల్లీ" చేపకు అవయవాలన్నమాట. అది ఈ అవయవాలను పొట్టిచేసుకో గలదు, సాగదీసుకోగలదు.

"జెల్లీ" చేపలలో అనేక రకాలున్నాయి. వీటిలోకెల్లా చెప్పుకోదగినది "సింహం జూలు" అనే పేరు గలది. దీని శరీరం ఆకారం సగానికి కోసిన నిమ్మకాయలాగా ఉంటుంది. ఈ జాతికి చెందిన "జెల్లీ" చేపలలో 7 అడు




"చందమామలు"

గుల నిడివీ, 3 అడుగుల మందమూ ఉన్నవికూడా ఉన్నాయట. వాటికి 800 పైగా నరాలు ఉండి, అవి నూరు అడుగుల పొడుగుంటాయట. ఇంతపెద్ద "సింహం జూలు" సముద్రమధ్యాన తప్ప, తీరాన కనిపించదు. దీని నరాలలో చిక్కుకున్న ప్రాణికి ప్రాణాపాయం తప్పక ఉంటుంది. అయితే ఇది తానై ఏ ప్రాణిమీదా కలియబడదు.

"జెల్లీ" చేపలలో ఒక జాతిని "చందమామలు" అంటారు. వాటి శరీరాలకు వేళ్ళాడే నరాలుండవు. తెరిచిన గొడుగులలాగా ఉండే వాటి శరీరాల అంచు వెంబడి కురచ వెంట్రుకలలాటవి ఉంటాయి. ఈ "చందమామ" లు అర్ధరూపాయి ప్రమాణంవరకూ పెరుగుతాయి. ఇవి సముద్రంలో మందలు మందలుగా ఈదుతూ కనిపిస్తాయి.

"దువ్వెనలు" అని మరొక రకం ఉన్నది. వీటి శరీరాలు కోలగా ఉండి వాటిలో ఎనిమిది దువ్వెనలవంటి భాగాలుంటాయి. ఈ చేపలు ఈ దువ్వెనలను



"గుండ్రని జెల్లీ"—"గంటలు"

తెడ్లలాగా ఆడిస్తాయి. "దువ్వెన" చేప గాజులాగా ఉండి కంటికి సులువుగా కనపడదు. కాని చీకట్లో దాని దువ్వెనలు నీలి కాంతితో ప్రకాశిస్తాయి, వాటి కదలిక చూడటానికి చాలా అందంగా ఉంటుంది.

గుండ్రగా ఉండే "జెల్లీ" చేపలు ఒకరకం ఉన్నాయి. వీటి శరీరాలకు రెండే నరాలు వేళ్ళాడుతూంటాయి. వాటికి సన్నని వెంట్రుకలలాటివి ఉంటాయి, కాని "విషపు ముళ్ళు" ఉండవు, వాటికి బదులుగా "జిగురు బిళ్లలు" ఉంటాయి. ఈ "జెల్లీ" చేపకు ఆహారంగా ఉపకరించే చిన్నచిన్న చేపలు ఈ జిగురుకు అంటుకుపోయి తప్పించుకోలేవు. అప్పుడు "జెల్లీ" చేప తన నరాలను పైకి లాగి ఆహారాన్ని నోట్లో పెట్టుకుంటుంది.

మరొక రకం జెల్లీ చేపలను "గంటలు" అంటారు. ఇవి గంటల ఆకారంలో ఉండి, శరీరాలను పెంచి ముడుచుకోవటంద్వారా నీటిలో ఈదుతాయి.



"దువ్వెనలు"

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు ఫుట్‌బాల్ ఆడుతున్నారు. 'టైగర్' కొంచెం దూరంగా నిలబడివున్నది. ఆసమయంలో ఒక కొంటె కుర్రాడు పెద్ద కుక్క నొకదానిని, 'టైగర్' మీదికి వుసికొలిపాడు. 'టైగర్' భయపడి దాసూ, వాసూలకేసి పరిగెత్తింది. దాన్ని వెంటాడివస్తున్న పెద్ద కుక్కకు దాసు కొట్టిన బంతి గట్టిగా తగిలేసరికి, కుయ్యోమని అరుస్తూ కిందపడి లేచి పరిగెత్తసాగింది. ఇది చూసి ధైర్యం తెచ్చుకున్న 'టైగర్' కొంటెకుర్రాడి వెంటపడింది. వాడు అదురుకుని పరిగెత్తటం చూసి, దాసూ వాసూలు పొట్టలు చెక్కలయేలా నవ్వారు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'



11 గంటలకు
నేటి ఉదయం
ఉల్లాసం
పొందడానికి కొద్ది
విశ్రాంతి చూసుకొని
ఒక కప్పు టీ
త్రాగండి



నేను టీనే-

మీ మనస్సు
బాగా వున్నపుడు,
లేనపుడు కూడా
నేను మీకు
చిర మిత్రుడను




PST 181



## గమనించదగిన లక్షణాలు...

- కడుపు ఉబ్బరము
- ఆకలి మందగింపు
- చికాకు చెందడము
- విరేచనము సరిగా కాకపోవుట
- కొద్దిపాటి జ్వరము - మొదలైనవి

మీ బిడ్డ లివరు, స్ప్లీను వ్యాధితో బాధపడుతూంటే కనిపించే మొదటి సూచనలు. గొప్ప అనుభవం కలిగిన జమ్మివారి సలహా తీసుకొని ఉపకారం పొందండి.

## జమ్మివారి
# లివర్ క్యూర్

పసి బిడ్డల లివరు & స్ప్లీను
వ్యాధులకు

జమ్మివారి వైద్యులు ప్రతిమాసము ముఖ్య ప్రదేశాలకు వచ్చెదరు. కార్యక్రమ పట్టికకొరకు అడగండి.

జమ్మి వెంకటరమణయ్య & సన్స్.
హెడ్ ఆఫీసు:
మైలాపూరు, మద్రాసు-4.
బ్రాంచీలు: విజయవాడ, విజయనగరం, తిరుచ్చిరప్పల్లి, కుంభకోణం, బెంగుళూరు.

JVZ—16 TG.

Photo by P. Krishnakumar



బహుమతి
పొందిన వ్యాఖ్య

అందమైన బాలలం

పంపినవారు :
జె. ఆర్. కె. శాస్త్రి - చిలకలపూడి

